# వార్తా చిత్రాలు



చైనా ప్రజా రిపబ్లికు పెద్దలు జనరలు యువాన్‌చంగ్ నాయకత్వాన కలకత్తానుండి 13 వ తేదీనాడు ఢిల్లీకి వెళ్లారు.



క్రొత్తఢిల్లీలోని భారతవ్యవసాయ పరిశోధనమండలి వార్షిక సమావేశంలో పట్టాలుపొందిన విద్యార్థులకు కర్తవ్యబోధ గావిస్తున్న కేంద్ర ఆహార వ్యవసాయమంత్రి శ్రీ కె. యం. మున్షీ









ఇండియాకు చైనా రాయబారిగా నియమితులైన జనరల్ యువాన్ చంగ్ శ్రీ రాజేంద్రప్రసాదుగారికి తన అధికార పత్రాలను సమర్పించి కరచాలనం చేస్తున్నారు



# ఆంధ్రపత్రిక

| | | |
|---|---|---|
| సంవత్సరచందా<br>రు 12-0-0<br>విడిప్రతిక<br>4 అణాలు | ప్రతిబుధవారము ప్రకటింపబడును<br>ఒరులేయవి యొనరించిన నరవర, యప్రియము తనమనంబున కగు దా<br>నొరులకు నవి సేయకునికి పరాయణము పరమధర్మపథముల కెల్లన్<br>(మహాభారతము)<br>**Founder : K NAGESWARA RAO** | సంపుటము 43<br>సంచిక 3 |

వికృతి సంవత్సర భాద్రపద బహుళ పాడ్యమి బుధవారము




సవాలు చేసి బయలుదేరిన పండిట్ నెహ్రూజీకి నాసిక్ కాంగ్రెసు సమావేశంలో [illegible] విజయం లభించింది. ([illegible])




# ఆంధ్రపత్రిక

1950-వ సం॥ సెప్టెంబరునెల 27-వ తేదీ బుధవారము


## నాసిక్ కాంగ్రెస్

నాసిక్ కాంగ్రెస్ మహాసభ గురువారము అర్ధరాత్రి జయప్రదముగ పరిసమాప్తమైనది. అవసర వస్తువులపై కంట్రోల్సు ఉండవలెనా, లేదా యను విషయములలోతప్ప, ప్రధాన సమస్యల పరిష్కారమునకు అనుసరింపతగిన విధానమునకు సంబంధించినంతవరకు నాయకులలో గాని, నాయకులకూ, ప్రతినిధులకు మధ్య గాని తీవ్రమభిప్రాయభేదములు ఏమీ లేవని ధృవపడినది. అన్ని తీర్మానములను విషయ నిర్ణయ సభవారు—ఇకమీాదట వీరే అఖిలభారత కాంగ్రెస్ సంఘసభ్యులు—కాంగ్రెస్ మహాసభ ప్రతినిధులు—వీరే వివిధ రాష్ట్రకాంగ్రెసు సంఘసభ్యులు—ఏకగ్రీవముగ ఆమోదించిరి. పండిట్ నెహ్రూ నాయకత్వమునందు భారత ప్రజానీకమునకు అచంచల, గాఢవిశ్వాసము కలదని 'పరోక్షజన ఓటింగు' పద్ధతిన ఎన్నికైన కాంగ్రెస్ ప్రతినిధులు ప్రకటించిరి.

జయపూర్ కాంగ్రెస్ విషయ నిర్ణయసభలో నైతిక ప్రవర్తన, కాంగ్రెస్‌వాదుల నైతిక ప్రమాణమునకు సంబంధించిన తీర్మానముపై జరిగిన రభసే, నాసిక్ కాంగ్రెస్ మహాసభలో ఆర్థిక తీర్మానముపై జరుగవలసి యుండెను. కాని నాయకుల అప్రమత్తత వలన అది నివార్యమయ్యెను. దేశ ఆర్థికపరిస్థితి చక్కబడి, అవసర వస్తువులు అందరికి సులభముగ లభించు వరకు కంట్రోల్సు ఉండవలెనని అధికార తీర్మానము కోరగ, అట్లే విషయనిర్ణయసభ ఆ తీర్మానమును యథాతథముగ అంగీకరించెను. మహాసభలో అచల్ సింగ్ గారు తీర్మానమున కొక సవరణ ప్రతిపాదించుచు కంట్రోల్సును తక్షణము తొలగించవలెనని సూచించిరి. ఈ ఒక్క సవరణ మీాదనే వోట్లు తీసుకొనుట జరిగినది. ఈ సవరణ నెగ్గిన భారత ప్రభుత్వ ఆర్థిక విధానములో కాంగ్రెస్‌కు విశ్వాసము లేనట్లు స్పష్టమయ్యెడిది. నెహ్రూ ప్రభుత్వము రాజీనామా చేయవలసిన పరిస్థితులు ఏర్పడి యుండును. దాదాపు రెండు వేలమంది ప్రతినిధులు హాజరైన మహాసభలో ఈ తీర్మానము చర్చకు వచ్చినపుడు మూడువందల ప్రతినిధులకంటె ఎక్కువలేరు అందులో 190 మంది అధికార తీర్మానమునకు అనుకూలముగ, సవరణకు ప్రతికూలముగ వోటుచేసిరి. 117 మంది మాత్రము సవరణకు అనుకూలముగ వోటుచేసిరి. సమావేశమునకు వచ్చిన ప్రతినిధులలో పదిహేను వందలకుపైగా ఈ తీర్మానము చర్చకు వచ్చినపుడు హాజరున లేకపోవుటను బట్టే వీరిలో అధిక సంఖ్యాకులు అధికార తీర్మానమునకు సుముఖులని భావింపవచ్చును. ఇంతమందిలో 117 మంది మాత్రము కంట్రోల్సు రద్దుకావలెనని కోరుట ప్రత్యేకముగ పరిగణింపవలసిన అంశముగాదు.

ఈ ఒక్క సంఘటనను వదలివేసిన నాసిక్ కాంగ్రెస్ మహాసభ, కార్యక్రమమంతయు సాఫీగా జరిగిపోయినట్లు చెప్పవచ్చును. మత సమస్యపైనను, విదేశాంగ విధానము పైనను, భారతదేశమందలి విదేశ వలసలనుగురించి భారత ప్రధానమంత్రి ఉద్రేకపూరితమైన ఉపన్యాసములు చేసిరి. ప్రభుత్వ విధానము లన్నింటికి నిర్నిబంధముగ తన ఆమోదమును తెలుపుటకు సిద్ధముగనున్న మహాసభలో ఉద్రేకముల ప్రదర్శనకు అవసరమే లేదు. సమావేశము జయప్రదముగ ముగిసినది. కనుక కాంగ్రెస్ వాదులందరు ఇక నాసిక్ తీర్మానములను అమలుజరుపుటకు కృషిచేయవలెను. అధ్యక్షుడు శ్రీ పురుషోత్తమదాస్ టండన్, ప్రధానమంత్రి పండిట్ నెహ్రూ సభాంతమున హెచ్చరించినట్లు కేవలము తీర్మానములు చేయుటవలన పని జరు

గదు. ఆ తీర్మానములను అమలు జరుపుటకే ప్రతి కాంగ్రెస్ వాది అవిశ్రాంతముగ కృషి చేయవలసి యుండును.

అది కాంగ్రెస్ వాదులలో 'ముఠాతత్వము' నశించి సంపూర్ణమైన ఐక్యత ఏర్పడినపుడే సాధ్యము. మహాసభలో యావత్తు తీర్మానములు ఏకగ్రీవముగ ఆమోదింపబడి, ఇట్టి పరివర్తన పండిట్ నెహ్రూ విజయసూచనయని భావింపబడుచుండ, శ్రీ టండన్‌తో పోటీచేసిన ఆచార్య కృపలానీ నాయకత్వమున కొందరు కాంగ్రెస్ వాదులు ప్రజాస్వామికవర్గమని ఒక 'గ్రూపును' స్థాపించుటకు ప్రయత్నించుట విచిత్రముగ నున్నది. వీరు యథార్థముగ, సంపూర్ణముగ ప్రజాస్వామిక వాదులైన, శ్రీ పురుషోత్తమదాస్ టండన్‌గారి ఎన్నికద్వారా వ్యక్తమైన ప్రజాభిప్రాయమును గౌరవింప వలసియున్నది. అట్లు చేయక కాంగ్రెస్ అధ్యక్ష ఎన్నికఫలితము ప్రకటింపబడినప్పటి నుండి కృపలానీ ప్రభృతులు ఒక ప్రత్యేక వర్గమును నెలకొల్పుటకు ప్రయత్నములు చేయుచుండిరి. అట్టి ప్రయత్నములు ఎంత అనవసరము, అనుచితమో నాసిక్ మహాసభ స్పష్టముగ ప్రకటించెను.

ఈ రాష్ట్రమున ప్రబలిన ముఠాతత్వమునుబట్టి ఈ గ్రూపు రాజకీయములు ఎంత అనర్థదాయకమో కాంగ్రెస్ అధిష్ఠానవర్గమునకు తెలుసును. శ్రీ ప్రకాశం ప్రభృతులు కాంగ్రెస్ శాసనసభయందు ఒక ప్రత్యేక వర్గముగనుండి వ్యవహరించుటకు సంకల్పింపగ అట్టిది కాంగ్రెస్ శిక్షణకు విరుద్ధమని, కనుక ప్రకాశం ప్రభృతులు ఈ ప్రయత్నమును విరమింపవలెనని కాంగ్రెస్ కార్యవర్గమువారు హెచ్చరించిరి. ఇప్పుడు ఆ కార్యవర్గమునకు చెందినవారే ఒక గ్రూపునిర్మాణమునకు దోహదము చేయుట శోచనీయము.

విధానములందుగాని, సిద్ధాంతములందుగాని భిన్నాభిప్రాయములు, భేదాభిప్రాయములు లేనపుడు ఒకవర్గము కాంగ్రెస్‌నుండి విడిపోగోరుటకుగాని, కాంగ్రెస్‌నందుండి ఒక ప్రత్యేక గ్రూపును స్థాపింప ప్రయత్నించుటకుగాని తగిన కారణములు కన్పించుట లేదు. ప్రధానమంత్రి కోరినట్లు, నాసిక్ మహాసభ అన్నివిషయములపైనను తీర్మానములు చేసి భారత ప్రభుత్వ విధానమునకు సంపూర్ణామోదమును తెలిపియున్నందున కాంగ్రెస్ విచ్ఛిత్తికి దారితీయు ఈవర్గ నిర్మాణమును నివారింపవలసిన బాధ్యత పండిట్ నెహ్రూపై గలదు. వారా బాధ్యతను నిర్వహింతురని విద్యార్థుల సమావేశములో వారు చేసిన ఉపన్యాసమునుబట్టి ఆశింప వచ్చును. ప్రత్యేక వర్గముల స్థాపనద్వారా కాంగ్రెస్‌ను బలహీన పరచుటను మించిన దేశద్రోహము వేరొకటి యుండదు. సర్దార్ పటేల్, పండిట్ నెహ్రూ ఈ ప్రమాదమును నివారింపవలెను. ఇందుకు వారెట్టి చర్యలు తీసుకొన్నను దేశము వారి అండను నిలుచును.

---

# విషయానుక్రమణిక
## 27 సెప్టెంబరు 1950



నాసిక్ ... లో నిర్మింపబడిన ... యబడిన మహాసభకు అధ్యక్షులు టండన్, ఆహ్వాన సంఘాధ్యక్షుడు హిరే, కార్యదర్శి కళావంక్రావుగార్లు నాసిక్ నగరమార్గాలలో ఊరేగి గాంధీనగర్‌కు వెళ్లారు



# నాసిక్‌లో ఆత్మపరీక్ష

నిత్యం తగువుల్లో మునిగి తేలే అన్నా చె… తల్లిదండ్రులమధ్య తగవు వస్తే ఎంత … తో, …గంతో, కుతూహలంతో గ… , అదేరీతిగా కాంగ్రెస్ వాదులందరూ నాసిక్ సమావేశంలో కాంగ్రెస్ సంస్థ చేసుకొన్న ఆత్మపరీక్షను గమనించారు. అయితే పరీక్ష ఎటూ తేలకుండా, గాలిలో తేలిపోయింది. కాని పరీక్షా సమయానికి నిలువలేకపోయిన కాంగ్రెస్ అంతర్వైమనస్యాలు తిరిగి గాలిలోనుంచి దిగి వచ్చి కాంగ్రెస్ వ్యవహారాలలో తిరిగి దుమారం రేపుకొట్టడానికి అట్టే కాలం పట్టదనే సత్యం అందరి హృదయాలలోనూ భారంగా తట్టుతూనే వుంది.

"కాంగ్రెస్ రాష్ట్రపతి" త్వానికి పురుషోత్తమదాస్ టండన్ గారిఎన్నికతో అగ్రనాయకులమధ్య వైరాలు పెచ్చురేగ గలవని ఆశించినవారికి ఒకవిధంగా ఆశాభంగం, ఒకవిధంగా సంతృప్తి కలిగాయి. వైరాలు నాసిక్‌లో పొక్కిపడలేదు. కొంత శాంతించినందుకు ఆశాభంగం. ప్రతిరాష్ట్రంలోనూ కాంగ్రెస్‌లో అనధికారకీత్య చాటునా మాటునా కల్లోలం తెచ్చి పెట్టిన పాక్షికవైరాలు కాంగ్రెస్ నాయకవర్గం అంతటా పాకిపోయి, అధికార స్వరూపం దిద్దుకో గలుగుతున్నందుకు సంతృప్తి. కొందరికి మొదటిది ఆశా హేతువయింది. రెండవది నిస్పృహకు హేతువయింది. కృపలానీగారి నాయకత్వం కింద వ్యతిరేకపక్షం ఒకటి ఏర్పడుతోంది.

మధ్య మధ్య తెరిపితో, జల్లులతో, భాద్రపదవర్షం కాంగ్రెస్‌వాదుల్ని చీకాకు పరిచినా వారు అట్టే ఇబ్బంది పడలేదు. ఇటువంటి పరీక్షాసమయంలో వరుణదేవుని చిలిపితనాన్ని కాంగ్రెస్ వాదులు లక్ష్యపెట్టే స్థితిలో లేరు. బాధలనుభవించినవారు పత్రికావిలేఖరులూ, ఆంధ్రదేశం మినహా భారతదేశం నలుమూలల్నుంచీ వచ్చిన నాయకమణుల దర్శనాపేక్షతో వచ్చిన మహారాష్ట్ర పల్లెజనులూ మాత్రమే. ప్రభుత్వం తమ చేతుల్లో ఉన్నందువల్ల పోలీసు బందోబస్తు, తంతితపాలా ప్రయాణాది సదుపాయాలూ ఆహారపానీయ నివాసాది సర్వసౌకర్యాలూ కాంగ్రెస్ సమావేశానికి పూర్తిగా లభించాయి.

నాయకుల నంటిపెట్టుకున్న విరోధవర్గాలు, పరిపాలనా వ్యవహారాలవల్ల ఏర్పడిన విరుద్ధ భావాలు

సమసించకపోయినా ప్రస్తుతం మాటుమణిగాయి పరిపాలకులవలంబిస్తున్న విధానాలపై కొంతకాలంగా చెలరేగుతున్న విరోధభావం నాయకుల ఉపన్యాసాలు వినగానే కొంచెం వెనక్కు తగ్గింది పాకిస్తాన్‌పట్ల భారతప్రభుత్వ విధానం భారతదేశంలో హిందూ-ముస్లిం సమస్య, విదేశాంగ విధానం, కంట్రోల్స్, ఆర్థిక వ్యవహార విధానం, విదేశాంగ రాజకీయాలు మొదలైనవాటిలో కాంగ్రెస్‌వాదులమధ్య ఏర్పడిన అసంతృప్తి ఇప్పటికి నివారింపబడి కేంద్రప్రభుత్వానికి బలం చేకూరింది

సవాలుచేస్తూ బయలుదేరి వెళ్ళిన ప్రధాని పండిట్ నెహ్రూ విజయోత్సాహంతో తిరిగి ఢిల్లీ చేరారు రాజకీయతంత్రాల కలవాటుపడిన కాంగ్రెస్ నాయకవర్గాలు కలిసి వచ్చినా రాకపోయినా సరే, భారత ప్రజానీకానికి తనలో అచంచల విశ్వాసం కలదని పండిట్ నెహ్రూకు తెలుసును. అందువల్లనే మతసమస్యలోగాని, పాకిస్తాన్‌తో వ్యవహారాలలోగాని తన విధానం కాంగ్రెస్‌కి అంగీకార యోగ్యం కాకపోతే పదవినుంచైనా విరమించుకోడానికి సిద్ధంగా ఉన్నట్టు ప్రకటించాడు గాని తన విధానాన్ని మార్చుకోదలచ లేదని స్పష్టంగా చెప్పాడు. వాస్తవానికి ఈ వ్యవహారాలలో నెహ్రూ ప్రభుత్వవిధానానికి కాంగ్రెస్‌లో ఎంతమంది సుముఖులున్నారో, ఎంతమంది విముఖులున్నారో తెలియదు. కొత్త అధ్యక్షుడు టండన్‌గారిని గురించి ఊహించుకున్నది మాత్రం పొరపాటని తేలింది. మత సమస్యలో పాకిస్తాన్ ఏ విధానాన్ని అనుసరించినప్పటికీ అది భారతీయులకు అనుకరణయోగ్యం కాదని టండన్ అధ్యక్షోపన్యాసంలో స్పష్టపరిచారు. టండన్‌గారి ఎన్నికతో హిందూ మతానురక్త రాజకీయవాదులకూ, అభ్యుదయ విరోధులకూ హర్షం కలిగిందని



వందేమాతరం గీతాలాపన జరుగుతుండగా అధ్యక్షులు టండన్‌గారు త్రివర్ణపతాకనావిష్కరించారు.



సమావేశం నిమిత్తం గులక్షలరూపాయల ఖర్చుతో నిర్మించబడిన గాంధీనగర్‌కు సింహగడ దుర్గస్వరూపంలో నిర్మించబడిన ఒక సింహద్వారము.



విషయ నిర్ణయసభలో సభా వేదిక నలంకరించిన నెహ్రూ, టండన్, పటేల్, రాజగోపాలాచారి ప్రభృతులు



విషయ నిర్ణయసభ... ంచు అధ్యక్షులు టండన్.

పండిట్ నెహ్రూ అధ్యక్షుల ఎన్నిక అనంతరం చేసిన ప్రకటన ఇప్పటికి పొరపాటేనని తేలింది

పండిట్ నెహ్రూ కోరినట్లు మతసమస్య, విదేశాంగ వ్యవహారాలు, ఆర్థిక వ్యవస్థా నిర్మాణాశయాలను గురించి నాసిక్ కాంగ్రెస్ ప్రభుత్వ లక్ష్యాలను సందిగ్ధ రహితంగా బలపర్చింది కాని పండిట్ నెహ్రూ కోరినది ఇదిమాత్రమే కాదు ఈనాడు కాంగ్రెస్ వారు (ఆమాట కొస్తే సర్వ పక్షాలవారూ) చెప్పే మాటలకు, చేసే చేతలకు చాలా వ్యత్యాసం ఉంటున్నది అలా కాక ఆచరణలో కాంగ్రెస్ వాదులు చిత్తశుద్ధి చూపాలంటున్నారు కాని ఇదెంతవరకు ఒనగూడుతుందో నేటి పరిస్థితుల్ని చూస్తే సందేహమే కలుగుతున్నది కాని మహాసభలో తీర్మానాలైనా తాము కోరినట్లున్నందువల్ల పండిట్ నెహ్రూ అత్యంత సంతృప్తి చెంది "కాంగ్రెస్ సంస్థలో కల జాతీయైక్యతా పటుత్వం" క్షీణించలేదన్నారు కాంగ్రెస్ సంస్థకు ఆసంస్థ ఆదర్శాలే రక్ష అని చెప్పారు కాని ఈనాటి నిత్య జీవితంలో సత్యం కల్పానికెంత పటుత్వమున్నదో, నేడు కాంగ్రెస్ వారిలో గాంధీజీ బోధించిన ఆదర్శాలకూ, వీళ్ళు నాడిపై కాంగ్రెస్ బలపడిందో ఆ దేశ సేవా శక్తికీ అంతకంటె ఎక్కువ పటుత్వం లేదని అంగీకరించక తప్పదు

దురదృష్టవశంవల్ల దేశం ముక్కలై కొన్ని ప్రాంతాల కొన్ని వర్గాలకు చెందిన ప్రజలు అతీత వ్యథావమానాలకూ దురంతాలకూ గురైన కారణంగా ప్రజలకు, నాయకులకు మనస్సులు చెదిరి వ్యవహారాలు ఉద్వేగానికి లోనైనాయి దీనికి తోడు దేశంలో ఆర్థిక సంక్షోభం, అధికార పదవీ వ్యామోహం చేయూత నిచ్చాయి

అందువల్ల కాంగ్రెస్ వాదుల్లో కాంగ్రెస్ తత్వం ఎంత ఉన్నది, అసలు కాంగ్రెస్ తత్వం స్వరూపం ఎలాంటిది, ఈ తత్వం కాంగ్రెస్ సంస్థ నెంతవరకు కాపాడగలదు, పరిపాలనా విధి కెంత వరకు ఉపకరించగలదు, ప్రస్తుత సమస్యల నెంతవరకు పరిష్కరించగలదు, దేశానికే విధంగా ప్రయోజనకారి కాగలదు అనే మీమాంస బయలుదేరింది కాంగ్రెస్ తత్వం అంటే సందిగ్ధ అభిప్రాయాలున్నాయి కాని అసందిగ్ధంగా కొన్ని ఆదర్శాల్ని విశ్వసించేవారు ఉన్నారు విశ్వసించి కూడా ఆచరణలో పెట్టలేని



వారున్నారు కాంగ్రెస్ ఆదర్శాలలో ఏవి ఆచరణ సాధ్యాలు, ఏవి కావు అనే విషయంపైన ప్రతి కాంగ్రెస్ వాది తర్జనభర్జన పడుతున్నాడు పరిపాలనాధికారంలో ఉన్న కాంగ్రెస్ నాయకులు ఆచరణ సాధ్యమైనవని భావించిన వానిని అమలు జరపడానికి యత్నిస్తున్నారు కాని వని భావించిన వానిని కాంగ్రెస్ సభ్యుల ఆ ప్రాయాలతో నిమిత్తం లేకుండా విడిచిపెట్టేశారు దీనివల్ల ఆదర్శాలలో విశ్వాసం చలించి పోయింది అభిప్రాయ భేదాలు అగ్రనాయకులలో కూడా వ్యక్తిగత వైమనస్యాలను తెచ్చిపెట్ట గలిగాయి క్రమంగా దేశసేవాసక్తి, ఆదర్శాలపట్ల విశ్వాసం ద్వితీయమై వైరాలు ప్రధానమైనాయి

ఈ సందిగ్ధావస్థ కాంగ్రెస్‌ని ఏ తెన్నున లాక్కుపోతున్నదో ఎవరికీ తెలియడంలేదు. ఆత్మ పరిశోధనకు నాసిక్ కాంగ్రెస్ అపూర్వావకాశం ఇచ్చింది కాని పండిట్ నెహ్రూ సవాలుతో ఆ అవకాశాన్ని కాంగ్రెస వాదులు చేయి జార విడుచుకున్నారు దుస్సహ సందిగ్ధ భావం.

గాంధీనగరావరణలో నిర్మితమైన గాంధీ మహాత్ముని ప్రతిమ



ఎవరు సమ్మతుల్ని విడిచి కాంగ్రెస్‌నూ, ప్రభుత్వాన్ని నడుపుతున్న పటేల్, నెహ్రూగార్లు



కొత్త అ[illegible]లు [illegible]ండన్, పాత అధ్యక్షులు. పట్టాభిగార్లు

కాంగ్రెస్ వాదులందర్నీ మరింత పీడిస్తున్నది.

సమావేశ కార్యక్రమాలలో కాంగ్రెస్ ప్రతినిధులమధ్య కృత్రిమ వాతావరణం ఏర్పడింది; ప్రతి వాని ముఖంలోనూ అసంతృప్తి, శంక, గోచరిస్తున్నాయి. ఎంతో ఆత్రుతతో వచ్చినవారు చిక్కు విడని కారణంవల్ల ఏదో తెలియని వ్యథతో తిరిగి వెళ్ళారు. ఏ సమస్య చర్చకువచ్చినా లోని భావాలను లోలోన అణుచుకుని చప్పట్లు చరిచారు. చేతులెత్తారు.

కంట్రోల్స్, ఆర్థికవ్యవస్థాశయ నిర్వచన తీర్మానాలలోతప్ప, పోలింగ్ కాని, తీవ్ర వాదాలుగాని జరగనేలేదు. సర్వ తీర్మానాలలోనూ పండిట్ నెహ్రూకి సంపూర్ణ విజయమే కలిగినా, ఈ విజయం వాస్తవం కాదనే అనుమానం అందరి భావాలలోనూ ద్యోతకమాతున్నది. ఏకగ్రీవంగా ఆమోదించబడిన తీర్మానాలకంటె వేలాది పల్లెవాసుల సందర్శనం పండిట్ నెహ్రూకు అధికానందంచేకూర్చింది. సర్దార్ పటేల్ అనారోగ్య కారణంవల్లనే కాంగ్రెస్ సమావేశాల్లో ఉపన్యసించకుండా ఊరుకున్నప్పటికీ, ఇది అనేకమందికి భయకారణంగా పరిణమించింది.

కాంగ్రెస్ రెండురోజుల సమావేశం

33-వ పేజీ చూడుడు



సభ వేదిక నలంకరించిన ప్రకాశం, రాజాజీ, ఆజాద్, పట్టాభి, పటేల్ ప్రభృతులు

కథానిక:

# తపతి



అతని పేరు ఆదిత్యుడు. కాని అతనిని ప్రజలు లోకాని కొక వేగుచుక్క అంటారు. కారణం - ప్రపంచసౌభాగ్యమే అతని జీవితాశయం. అయితే అతనిలోని ఈ సుగుణం భారతీయులలో వింత కాదు. మానవసేవయే ముఖ్యాశయంగా ఎంచిన మహానుభావులు ఇంతకు ముందు అనేకమం: ఈ పుణ్యభూమిపై చరించారు, ఎప్పుడూ ఉన్నారు. కాని ఆదిత్యుని సిద్ధాంతంలో ఒక కొత్తదనం ఉంది. ప్రేమ, గౌరవం అనే రెండింటినీ, పెద్ద చిన్న అనే వివక్షత లేకుండా అందరపట్లనూ సమానంగా చూపేవాడు. పుణ్యాత్ముని వద్ద ప్రవర్తించిన విధాన్నే పాపాత్ముని వద్దనూ ప్రవర్తించేవాడు కాని ఈ సూత్రంలో ఎక్కడో లోపం ఉందంటారు కొందరు పెద్దలు. చీకటిని పోగొట్టే వెలుగు తృష్ణతో బాధపడే లేడికి జలాశయాన్ని చూపుతుంది. ఆ వెలుగే ఆకలిగొన్న సింహానికి లేడి ఉనికిని తెలుపుతుంది. ఈ వెలుగు ఒక విధంగా లేడికి సహాయకారి అయినా, మరో విధాన ప్రాణహానికి తోడ్పడుతున్నది. ఈ విషయంలో వెలుగుకు నిష్పక్షపాతబుద్ధి ఉందని చెప్పగలమా?

ఆ వెలుగే వేటకానికి సింహాన్ని చంపుటకు కూడ సహాయం చేస్తుందని అంటాడు ఆదిత్యుడు.

అయితే, ఈ నిష్పక్షపాతబుద్ధివలన ప్రయోజన మేమిటి? లేడి సింహంచేత చంపబడుతున్నది. సింహం వేటకానిచేత చంపబడుతున్నది. వేటకాడు కూడతన శత్రువుచేత చంపబడవచ్చును. దీని కిక అంతు ఎక్కడ?

అంతు లేనిమాట నిజమే కాని జీవిత చిత్రంలో ఇది ఒక్క అంశంమాత్రమేనని ఆదిత్యు డంటాడు. వెలుగే పాపాని కొడబడుతున్న దనలేము కదా!

ఆదిత్యుని పుత్రిక తపతి తండ్రి ఆశయాలను చక్కగా అర్థం చేసుకున్న యౌవని అందరిపట్లనూ సమానాదరణ చూపడం ఒక మహా త్యాగమని ఆమె అభిప్రాయం. అందం, యౌవనం, ప్రేమ, వివాహం, మొదలైనవి స్వలాభంకోసం స్వసౌఖ్యంకోసమే కాని, మానవసేవకు తోడ్పడేవి కావు ప్రపంచసౌభాగ్యమే జీవితానికి ఆనందాన్నిచ్చేది. ఈ సూత్రాలకు ఎదురుతిరిగి ప్రవర్తించే వ్యక్తులు ఈ ప్రపంచంలో ఉన్నా ఒకటే, లేకున్నా ఒకటే; అనే భావం ఆమెహృదయకుహరంలో ఇమిడి ఉండేది. ఇట్టి మహదాశయా లున్న తపతి ఆదిత్యునకు చేదోడు. ఆమెకు సూర్యభగవానునియందు అధిక భక్తి, కారణం ఆమెలో కల భావాలే సూర్యునిలో మూర్తీభవించి ఉన్నాయి. సూర్యుడు తన కాంతిని ఈ విశాలజగత్తులో నలుమూలలా సరళంగా విస్తరింపచేస్తాడు.

ఆదిత్యుని ఆశయాలందు నమ్మిక గలిగి, వానిని ఆచరణలో పెట్టగలిగిన వ్యక్తి మరొక డున్నాడు. అతని పేరు సంవరణుడు. సంవరణుడు మహారాజు. భోగభాగ్యాలకు కొదువ లేదు. కాని

మానవసేవ చేయదలచు కొన్న ప్రతి వ్యక్తి ఆజన్మాంతం బ్రహ్మచారిగా ఉండాలని అతని అభిప్రాయం. వివాహం నిష్పక్షపాతబుద్ధికీ, ప్రజాసేవకూ ఆటంకాలు. సర్వజనుల్నీ సమానంగా ప్రేమిస్తూ, ప్రత్యేకంగా ఒక స్త్రీని తన ప్రేమకంతకీ పాత్రురాలను చెయ్యడం విరుద్ధ మనుకున్నాడు.

* * * *

ఆవేళ సంవరణుని జన్మదినం. గురువైన ఆదిత్యునకు తన గౌరవం ప్రకటించడానికి ఆయన నివాసానికి వెళ్లాడు. ఉపవాసాలతోనూ, నియమ నిష్ఠలతోనూ పెంపొందిన సంవరణుడు ఒక మహాజ్యోతివలె ప్రకాశిస్తున్నాడు. ఆదిత్యుడు సంవరణునకు తగిన గౌరవమర్యాదలు జరిపి కూర్చుండ చేశాడు. కాని ఎందుకో ఆదిత్యుని మనస్సు కొంచెం కలవరపడుతున్నది ఆనాడు. సంవరణుని ప్రవర్తనలో ఏదో లోప మున్నదని అతని అంతరాత్మ చెప్పుతున్నది. యౌవనంలో ఉన్న మహారాజుకు ఇంతటి కఠిన నియమాలు, నిష్ఠ అనవసర మని ఆదిత్యుని అభిప్రాయం. మహారణ్యాలలో నివసించే మునులకే తగును. కాని ప్రజలను పాలించే రాజుకు ఇది తగదు, అనుకున్నాడు ఆదిత్యుడు. సంవరణుని దీవిస్తూ "నాయనా, నా దొక చిన్న కోర్కె ఉన్నది." అన్నాడు.

"పెద్దలు తమరు. మీ కోర్కె ఏదో తెలియచేయండి గురూ "

"నీ రాజ్యపాలనలో ప్రజలంతా సుఖంగా ఉంటున్నారు. కాని, దాంపత్య జీవితం ప్రజాసేవకి ఆటంక మనే నీ అభిప్రాయం ఒక పిచ్చి నమ్మకమని నా ఉద్దేశం."

"క్షమించాలి. నా మనస్సు మరొక విధంగా ఉన్నది. స్వసౌఖ్యంకోసం తాపత్రయపడిన ట్లయితే స్వార్థమే అన్నిటినీ అణగత్రొక్కి తాను ప్రధానమై కూర్చుంటుందని నా అభిప్రాయం "

"కాదు. సంవరణా! వివాహం స్వసౌఖ్యానికే కాదు. మానవసేవకు కూడా తోడ్పడుతుంది. త్యాగ మనేది మతం కాదు త్యాగబుద్ధితో సంఘసేవ చేయడం నీ ఉద్దేశం కాని నీ నియమంలో పటుత్వం లేదు. వివాహమయినతర్వాత భార్యాభర్తలిద్దరు ప్రజాసేవకు నడుము కట్టుకొనవచ్చును. చూడు—నాకు, నీకు ఏ విషయములోనూ భేదం లేదు. నేను దాంపత్యజీవితం గడుపుతున్నాను. కొడుకులు, కూతుళ్ళతో హాయిగా కాలం వెళ్ళబుచ్చుతున్నాను. నా ఆశయాల కట్టి భంగం కలగలేదు. అయినప్పటికీ నా కుమార్తె పెండ్లివిషయంతలంపుకు వచ్చిన పుడెల్ల చింత కలుగుతున్నది."

"దాని కంత చింత ఎందుకు? మీభావం నాకు పూర్తిగా బోధపడలేదు, గురూ!"

"ఆమెను నీవు వివాహం చేసుకోవాలని నా కోర్కె."

సంవరణుడు అప్రతిభుడైనాడు. "మహాప్రభూ, తమయందు నాకు అపార గౌరవ మున్నది. మీ సిద్ధాంతాలనే నమ్మి పాటిస్తున్న నా మార్గాన్ని మీరు నిరోధించకండి. తమరు నాకు గురువులు. తమపట్ల, తమ సిద్ధాంతాలపట్ల నాకు గల విశ్వాసం అచంచలంగా ఉండాలని ఎల్లప్పుడూ నా మది కోరుతున్నది."

"నా సిద్ధాంతాలకు విరుద్ధంగా నిన్నేమీ చెయ్యమనడం లేదే!"

"కాని నే నా విధంగానే భావించవలసి వస్తున్నది. మీ పుత్రిక వివాహంలో మీకు గల ఆసక్తే మీచేత నన్నిట్లు ప్రేరేపింప చేస్తున్నది. మీ యీ కోర్కెలో స్వలాభం ప్రత్యక్షమౌతున్నది "

ఆదిత్యుడు నిరుత్తరుడైనాడు. సంవరణుడు చెప్పినదానిలో నిజము లేకపోలేదు. తన కుమార్తెకై యోగ్యుడైన వరుని వెదకుతున్న మాట వాస్తవం. అది కాక సంవరణుడే తపతికి తగిన భర్త కాగలడని ఆయన ఉద్దేశం. స్వలాభంకోసం తాను సంవరణుని నియమం మార్చుకోమని బోధించాడు. కాని ఇందులో ఏమైనా పొరబాటుందేమో ఆదిత్యుడు తరచితరచి చూశాడు. అంతరాత్మను ప్రశ్నించాడు. కాని సమాధానం లేదు. సంవరణుడు తనతో అన్నమాటలకు కొంచెం కించపడ్డాడు. మెల్లగా ఇలా అన్నాడు. "సంవరణా! నా స్వార్థానికీ, ఈ ఉపదేశానికీ ఎటువంటి సంబంధ మున్నప్పటికీ, నే చెప్పిన దానిలో ఏమైనా లోప మున్నాదా?"

సంవరణుడు కొంత ఉద్వేగంతో ఇలా అన్నాడు."అటువంటి అపేక్షయే మీ ఉపదేశానికి హేతువైతే, తమరు తప్పక పక్షపాతబుద్ధి ప్రకటించారనడానికి నే నెంత మాత్రమూ జంకను. మీ పుత్రికపెండ్లి విషయమే మిమ్మల్ని ఎక్కువగా బాధిస్తున్నది కాని, అందులోని స్వార్థం మీకు కానరావడం లేదు. అది ప్రజాసేవాశయానికి విరుద్ధమని నేను నిశ్చయంగా చెప్పగలను."

"పొరబడుతున్నావు రాజా! -నా సిద్ధాంతాలనుంచి నే నెన్నడూ దూరం కాను. నే నిప్పటికీ ఆ సూత్రాలనే మనః పూర్వకంగా విశ్వసిస్తున్నాను. నీవు నా కుమారుడవు కావు. అయినా, తపతి ఎంతో నాకు నీవుకూడా అంతే. నేను నిన్ను నా కుమారునికంటె అధికంగా గౌరవిస్తున్నాను. నా ఆందోళన, అపేక్ష తపతి వివాహంగురించి మాత్రమే కాదు. సంవరణునికి తగిన వధువును చేకూర్చడంకూడా ఇమిడివుంది. రెండువిధాలా ఈ భారం నాపైన ఉన్నది. అయితే మీ ఇద్దరి సంయోగంవలన ప్రపంచానికి ఉత్కృష్ట సేవ లభించగలదని నా విశ్వాసం. అందుకే నిన్నింతగా కోరవలసివచ్చింది. ఇందులో దోష మున్నదని నేను భావించడంలేదు "

"గురువులు—క్షమించాలి మీరు చెప్పినది నాకు మనస్కరించడం లేదు. ఇంద్రియాలను జయించాను. నిశ్చలమైన జీవితాన్ని గడపడమే నా ముఖ్యాశయం. ప్రతిఫలం లేనటువంటి ప్రజాసేవయే నేను చేయగోరేది. నేను ఇప్పటిలో వివాహం చేసుకున్నట్లయితే స్వసౌఖ్యాసక్తుడనై, ఒక స్త్రీప్రేమను ఆర్జించడంలోనే నా మనస్సంతా లగ్నమైపోవచ్చును. నా విధ్యుక్తధర్మాన్ని విస్మరించగల అవకాశ ముంది."

ఆదిత్యుడు స్తబ్ధుడైపోయాడు. మరేమీ మాటాడలేదు. సంవరణుడు తిరిగి తన రాజ్యాన్ని చేరుకున్నాడు. గురువువద్దకు వెళ్ళినందుకు అతడు క్రొత్త విషయాలు తెలుసుకొనలేదు. పైగా గురువుగారిని ఆయన సిద్ధాంతాలతోనే ఓడించాడు.

* * *

సంవరణుడు ఒకనాడు ఒంటరిగా అడవికి వెళ్ళాడు. ఆటవికప్రజల జీవితాన్ని పరిశీలిస్తూ, ప్రయాణిస్తూ ఉండడం సంవరణునికి ప్రీతి. మునీశ్వరులను దర్శిస్తూవుంటాడు. తిరిగితిరిగి అతడు ఆ మహారణ్యంలో ఒక ఎత్తైన ప్రాంతం చేరాడు. ప్రకృతి అతిరమణీయంగా ఉంది. నిర్మల నీలాకాశపుటందం, అస్తమిస్తున్న సూర్యుని బంగారుకాంతులతో అరణ్యసౌందర్యం ద్విగుణీకృత మయింది. దూరాన పర్వత పంక్తి. చుట్టుప్రక్కల రకరకాల అడవి జాతి పూపొదలు. మనస్సున కెంతో ఆనందాన్ని చేకూర్చుతున్నాయి. ఒక సన్నని కాలిబాట అడవిగుండా పోయి, ఆ పర్వత పంక్తిని చేరుతున్నది. దిగువను మైదాన ముంది. కొండ చరియలలో కొన్ని ఇళ్ళు కానవస్తున్నాయి. సంవరణుడు మరలిపోవడానికి సంకల్పించుకున్న సమయంలో ఆసన్నని కాలిబాటనే నడుస్తున్న ఒక ఛాయ

దూరాన కొనవచ్చింది. అత డక్కడే నిల బడి చూస్తున్నాడు. ఆ ఛాయ సమీపిస్తు న్నది. క్రమంగా ఆమె ఛాయ దగ్గిరకు రానురాను ఒక యువ్వని అని తెలియ వచ్చింది. కొంతదూరంలోనే ఆమె ఆగి పోయింది. సంవరణుడు కొంత సేపు ఆలో చించి ఆమెను మెల్లగా సమీపించాడు. అతనికి ఆశ్చర్యం కలిగింది. ఇంతవరకూ తాను చూసి అనుభవించిన ప్రకృతిసౌందర్య మంతా కలబోసి తీర్చిదిద్దినట్లుం దామె. ఇంతవరకూ పొందిన ఆనందానుభూతిలో ఏదో లోప మున్నట్లు ఇప్పు డాతనికి తట్టింది. ఆ యువతిని చూడగానే ఆ లోపం తీరిపోయిందని అతనికి స్ఫురించింది. ఆమెలో కల తేజము, అందము సంవరణుని ముగ్ధునిచేశాయి. ఈ విశాలజగతిలో అంద మయినవస్తువంటూ ఒకటి ఉన్నదనిఈనాటికి తెలుసుకున్నాడు అతడు. ఆమెసాక్షాత్కా రంతో వింత ఛాయలు పులుముకుంటున్న ప్రకృతి ఆనందాతిరేకంతో పూపరిమ ళాన్ని వెదజల్లింది. సెలయేరు గలగల మంటూ చక్కని సంగీతంతో చిత్రమైన ఉపదేశాలు చేస్తున్నది.

పరస్పరావలోకనంలో ఉభయులూ కొంతసేపు తమ ఉనికిని మరచిపోయారు. తరువాత తెప్పరిల్లి ఒకరి కొకరు సెరుకపరచు కొన్నారు. ఆమె తపతి. ఆదిత్యుని పుత్రిక. ఇద్దరూ చింతాజలధిలో ఉక్కిరి బిక్కిరయారు.

సంవరణుని నిరాకరణ ఆమెకు తెలు సును. భయంతో ఆమె విచలిత అయింది.

ఆమెసౌందర్యానికి ముగ్ధుడైన సంవర ణుని లజ్జ ఆవహించింది. అతడు శిరసు వంచుకున్నాడు. కొంతసేపటికి తిరిగి చూసేసరికి ఆమె అక్కడ లేదు. అప్పటికి అంధకారం ఆక్రమించింది.

ప్రపంచమంతా తలక్రిందులయినట్లు తోచిం దతనికి. తాను పాలిస్తున్న నియ మాలు, నిష్ఠ అన్నీ ఎందుకు? అతడు ఓడి పోయినట్లు తనలో తా నంగీకరించాడు. అతని మనోకాశమంతా తపతిరూపసౌంద ర్యంతో నిండిపోయింది.

* * *

సంవరణుడు తిరిగి రాజ్యం చేరుకోలేదు. ప్రజలంతా ఆశ్చర్యపోయారు. రాజ్యం విడిచి, ప్రజాసేవ మరచి అతడు ఆ అర ణ్యంలోనే నివాస మేర్పరచుకున్నాడు. సంవరణుని మనోగర్వమే అతనిని నిలు వునా కూలద్రోసింది.

దేశంలో అరాచకం ప్రబలింది. రాజు లేని రాజ్యములో శాంతి లేదు. ఒకనాడు వసిష్ఠమహర్షి సంవరణునివద్దకు వచ్చాడు సంవరణుడు మనోవేదనచే కృశించి పోయాడు. అతని ముఖంలో పూర్వపు తేజస్సు లేదు. అతని విచారకారణం తెలుసుకొని వసిష్ఠుడు ఆదిత్యునికి తెలియ చేశాడు.

ప్రకృతిసౌందర్యానికి ముగ్ధులై, ఆశయాలొకటై, జీవితధర్మ మొకటై అనుష్ఠాన మొకటైన తపతీసంవరణుల దాంపత్యం లోకాని కొక కొత్త వన్నె తెచ్చిపెట్టింది.

(ఒక బెంగాలీరచన ఆధారం)

# జోగ్ జలపాతం

శ్రీ పుల్లాభొట్ల వెంకటరామశర్మ

[మనోజ్ఞమైనది. జోగ్ జలపాత సందర్శనం ప్రకృతి అద్యంతాలను మనోనేత్రాలకు కట్టేటట్లు చేస్తుంది. జ్యోత్స్నారాత్రులందు ఆ జలపాతంయొక్క శత సహస్రకాంతులు, ఆ ప్రణవ నాదం, క్షణక్షణమునకు పరిణామమందు ఆ శోభదర్శనీయమే. అట్టి ప్రవిమల, ప్రశాంత, ప్రమోదనిలయం, ఆత్రిజగన్మోహన నీలకాంతుని స్ఫురణకు తెచ్చి, చిత్తానికి శాంతిని, సౌఖ్యాన్ని చేకూర్చగలదు.]

"నిత్యానందం సత్యమనంతం
  బ్రహ్మ పరాత్పర మవ్యయమమలం
నిత్యం, శుద్ధం, బుద్ధం, శాంతం,
  శాశ్వత మప్రమేయ మాద్యం
సర్వాసా ముపనిషదా మర్థ
  శ్శ్రీరామ స్సీతాపతి రితి
హరిహరచతురాననాది భి
  ర్గీయతే యస్తస్య దాసోహం.

"ఏది మనసా, పూర్ణానందరూపమును, సత్యమును, అనన్తమును, క్షరము కంటె పరము, నాశము లేనిదియు, శుద్ధమును, శాశ్వతమును వికారములేని జ్ఞాన రూపమును, శాన్తమును, శాశ్వతమును, అప్రమేయమును, ఆద్యమును, సర్వ ఉపనిషత్తులకు అర్థమగు బ్రహ్మపదార్థము, ప్రకృతిరూప యగు సీతకు భర్తయును యోగి జన చిత్తగతుడైన శ్రీరామచంద్ర పరబ్రహ్మమేను; అని బ్రహ్మవిష్ణుమహేశ్వరాదుల చేత ఏ రాముడు కీర్తింపబడెనో ఆ దేవునకు నేను భృత్యుడను."

యోగరతో వా భోగరతో వా
సంగరతో వా సంగవిహీనః,
యస్య బ్రహ్మణి రమతే చిత్తం,
నన్దతి, నన్దతి, నన్దత్యేవ॥

కేవలము ఐహిక సుఖప్రదాయకములగు రాజభోగాదియోగములం దాసక్తి గలవాడై యొకవేళ నొప్పినను, ఒకవేళ నవప్రసూన ధామాంగనాపాంగ బంధురగంధనందన చందనాది విషయలంపటుడైననూ, ఒకప్పుడు సకల బంధుమిత్రాది పరివారలాలసుండైననూ, ఎవ్వనియొక్క మనము నిష్కల్మషానంతప్రమేయ శుద్ధబుద్ధ శాంతస్వరూపంబగు నాత్మయందు క్రీడించుచున్నదో, ఆ నిస్సంగుడే ఆనందించుచున్నాడు.

ప్రకృతి దేవతానాట్య సాక్షాత్కారనిలయమూ, యోగీశ్వరనందాశ్రమమూ, బ్రహ్మానంద సామ్రాజ్యమ్మున ఊయల లూపు నట్టి యోగ (జోగ్) జలపాతమును నేను దర్శించినంతనే శ్రీ వసిష్ఠ, ఆనందగిరి ప్రోక్తమైన పై శ్లోకములు నా మానస



జోగ్ జలపాతం



శరగల్ అనకట్టవద్ద కొత్తవంతెన ప్రక్కన అందముగా అమర్చిన సుందరజల యంత్రము

తరంగమున నాట్యమాడినవి. శరావతినదియోగ మరమున్న ప్రాంతమున ఉత్తుంగశిఖరమునుండి పడుటవలన ఈ జలపాతమునకు 'జోగ్' జలపాతమని ప్రశస్తి కల్గినది. యోగమూలమూ, ఓంకారాలాపాభిరామమూ, అయిన యోగ జలపాతము ప్రకాశమానమూ, పరమానందదాయకము. "యోగః చిత్తవృత్తినిరోధః—"చిత్తవృత్తులను నిరోధించుటయే యోగమనబడునని పాతంజలి తెలుపుచున్నాడు. జ్ఞాన, యోగ, కర్మ, భక్తిమార్గములలో యోగమార్గము సామాన్యులకు అయోమయమార్గమైననూ తదాయత్తచిత్తులైనవారికి అది సులభగమ్యమే.

'సోహం' 'సోహం' 'తత్వమసి' 'అహం బ్రహ్మాస్మి' ఇత్యాది మహావాక్యములు ఆత్మయే ఈశ్వరుడని ప్రబోధించుచున్నవి. "తస్యవాచకః ప్రణవః" ఓంకారమే ఈశ్వరుని నామము. "తజ్జపస్తదర్థభావనమ్" ఇట్టి ఓంకారమును జపించుటయు, ఓంకారముయొక్క అర్థమును భావించుటయు అపవర్గసాధనము. నిరంతరమును ఓంకారజపమే నిజమైనఉపాసనమనియు, ఈ నాదబ్రహ్మోపాసనచే, స్వస్వరూపజ్ఞానమును బడియవచ్చుననియు వేదములు ఉపనిషత్తులు జోగ్ జలపాతమువలెనే ఘోషించుచున్నవి.

శరావతినది పర్వతాగ్రమునుండి **క్రిందికిపడు నిశ్శబ్దప్రదేశమున ప్రణవనాద** ముప్పతిల్లి, పృథివ్యాపస్తేజోవాయురాకాశములు, మన మానసక్షేత్రములయందొకపరి తటిత్తువలె భాసించును.

అట్టి ఈ దివ్యస్థలము మైసూర్ సంస్థానములో, సహ్యాద్రిపంక్తులలో అరేబియా సముద్రమునకు 40 మైళ్ళ దూరమున, మైసూరు, బెంగుళూరు, బళ్ళారి ఈ మూడు పట్నములకును కొంచెమించుమించు ఒకే దూరమున, (238 మైళ్ళు) నున్నది. తలగొప్ప ఆఖరు రైలుస్టేషను అచ్చటనుండి బస్సులో పదిమైళ్ళుపోవలెను. శరావతి నది 888 అడుగుల ఎత్తునుండి యోగమరము వద్ద క్రిందికిపడుచున్నది. నవనవోన్మేషమైన ఆ ఫేనరజతాచలము, మనోజ్ఞమైన ఆ జలపాతమంజులప్రణవగానము మనోక్షేత్రములకు, హృత్తంత్రులకు అనుభవైకవేద్యమేగాని ఈలాగని వర్ణింపలేము.

శరావతి శతసహస్రశరవేగముతో క్రిందికి ఉరుకునపుడు ఆవాఃకణపరిపూర్ణమైన స్ఫటికసదృశఫేనములు అంతటిలోనే హిమాంశమై, అంతటిలోనే మేఘమాలికలై, అంతటిలోనే పవమానసంసర్గమున వర్షరూపమై అచ్చటనే ప్రత్యక్షమగు దృశ్యము కేవలము పారవశ్యమును కల్గించును.

నాదోపాసనవలననే శంకరుడు నారాయణుడు, బ్రహ్మ వెలసినారనియు, ఈ త్రిమూర్తుల కాశ్రయమైనదే నాదమనియు మహాత్ముల మతము. నాదము శుద్ధచిన్మాత్ర స్వరూపమనియు, ఆ చిన్మాత్రమే ఆయా గుణోపాధిభేదములతో త్రిమూర్త్యాత్మకముగా వెలసినదని సంప్రదాయము. సృష్ట్యాదిలో నారాయణుని నాభిదేశమందు సకలలోక నివాసమగు నొక పద్మము

(30-వ పేజీ చూడుడు)



శరగల్ అనకట్టవద్ద కొత్తవంతెన ప్రక్కన అందముగా అమర్చిన సుందరజల యంత్రము.

# 1950లో ప్రజాస్వామ్యం నూరుపాళ్లు

శ్రీపురోహిత్

కళారాధకమండలి అధ్యక్షులు అకస్మాత్తుగా కాలం చేశారు. పెత్తనానికి చేరుకున్నాడు. షష్ఠిపూర్తి జరిపించుకున్న మహానుభావుడు; ఏదో నాలుగు కాలాల పాటు బ్రతికి నానారకాలైన రుచుల్ని అనుభవించినవాడు; కీర్తిశేషుడయ్యాడుగదా, అంటే,— చెప్పొద్దూ, — ఎవరికీ అంతగా విచారం కలుగలేదు. అయితే, ఆయనతో పాటు మా కళారాధకమండలికూడా కీర్తి శేషత్వాన్ని పొందుతుందన్న యథార్థాన్ని మొదట మేమెవ్వరం గుర్తించలేకపోయాం. మందమతులం! ఆయనగారి క్రియాకర్మలు యథావిధిగా జరిపించి, ఆ తరువాత మా మండలికి నూతనాధ్యక్షుణ్ణి ఎన్నుకోవలసిన తరుణం వచ్చింతరువాతగాని, చచ్చింది కేవలం మా అధ్యక్షులవారే కాదనీ, మా మండలి కూడా వారితోపాటు చావుకు సిద్ధమైందనీ, తుదకు కీర్తిశేషులైన మా అధ్యక్షులవారే అడ్డుపడి మామండలి చావకుండా ఆకాస్తకీర్తి నిలబెట్టారనీ, తెలిసొచ్చింది మాకు.

... ... ...

మండలి అధ్యక్షులు కాలంచేశారు. కాబట్టి మరొక అధ్యక్షుని ఎన్నుకోవలసిన బాధ్యత సభ్యులైనమాఅందరిమీదా పడింది. అదృష్టమనండి, లేదా దురదృష్టమనండి. మామండలి సభ్యులపై ఇంతవరకూ ఇలాంటి బాధ్యత లెప్పుడూ పడివుండలేదు ప్రతి సభ్యుడికీ వోటింగు అధికారంవుందనీ ప్రజాస్వామ్యసూత్రాన్ననుసరించి అధ్యక్షుని ఎన్నుకోవచ్చుననీ, అవసరమనిపిస్తే దింపొచ్చుననీకూడా మాసభ్యులందరికీ తెలుసు. కాని ఆ విధానాల్ని ఆచరించవలసిన అవసరం ఈనాటివరకూ రాలేదు. అధ్యక్షుని అకాలమరణంమూలంగా తమకున్న ఈ హక్కుల్ని వినియోగించుకునేందుకు అవకాశం వచ్చినందుకు, ఒకవిధంగా అందరూ హర్షించారనే చెప్పాలి.

ఒకానొక శుభముహూర్తాన మా మండలి సభ్యులంతా నూతనాధ్యక్షుణ్ణి ఎన్నుకునే వుద్దేశ్యంతో, టౌన్‌హాలులో సమావేశమయ్యారు! సమావేశాల లాంఛనాలు యథావిధిగా జరిగిపోయింతరువాత, ఒక పెద్ద మనిషి లేచి "మనమంతా కలిసి యెవరినైనా ఒక సభ్యుణ్ణి అధ్యక్షునిగా ఎన్నుకోవాల్సివుంది" అని ప్రకటించాడు. సభ్యుల్ని పేర్లు సూచించవలసిందిగా కోరాడు. వెంటనే హాలు నాలుగు మూలల నుంచి పేర్లవర్షం కురిసింది ... రంగయ్య, మంగయ్య, భుజంగరావు, కళింగరావు, ఆనందరావు, సదానందరావు, తుపాకుల నుండి మందుగుండ్లలాగా దూసుకువస్తున్నయ్ పేర్లు! "శాంతి స్థాపనార్థమై యుద్ధం చేయాల్సివుంటుంద"న్న లోకోక్తి ననుసరించి హాలులో జరుగుతూవున్న హంగామాను మించి పోయేవిధంగా చప్పట్లు కొట్టి, ఆ పెద్దమనిషి సభ్యుల్ని నిశ్శబ్దంగా వుం వలసిందిగా ప్రార్థించాడు . . సభ్యులంతా నిశ్శబ్దం

'లెక్చర్లు వినడానికి మేము రాలేద'ంటూ కొన్ని గొంతులు చేస్తున్న గోలను కూడా లక్ష్యపెట్టకుండా, ఆ పెద్ద మనిషి చిన్నపాటి ఉపన్యాసం ఇచ్చాడు. "ఒకరు ఒక పేరు సూచించడం, ఇంకొకరు మరోపేరు సూచించడం - ఇలాంటి హక్కు సభ్యులకు వున్నప్పటికీ దాని ఆచరణమూలంగా, ప్రజాస్వామ్యపు సూత్రం యొక్క ప్రథమావస్థలో నున్న సభ్యులందు కలత లేర్పడి, మండలిలో చీలికలు కలిగే ప్రమాదంవుంది కాబట్టి, సభ్యులంతా కలిసి యేదో ఒక పేరు సూచించాలి" అని ఆ ఉపన్యాసంలోని సారాంశం. సలహా బాగానేవుందని తలలూపారు సభ్యులంతా.

ఇంతలో ఒకమూలనుండి "రంగయ్యగారిని ఏకగ్రీవంగా ఎన్నుకోవడం మంచిది" అని వినిపించింది. తక్షణమే కొన్ని హయగ్రీవాలు అందుకొన్నయ్ "అట్లా వీల్లే"దని.

"ఎందుకు వీల్లేదు ?"

"ఎందు కేమిటి ?. అంతే! వీల్లేదు."

"సంగీతంలో రంగయ్య దక్షుడు."

"ఆ! దక్షయజ్ఞానికీ, రంగయ్యసంగీతానికీ, ఇక వేరే చెప్పాలా! "

"మీరంతా రంగయ్యని అవమానించడానికి పూనుకున్నారు."

"మేం కాదు; మూలనున్న రంగయ్యగారిని ముందుకు లాగి మీరే ఆపనికి పూనుకున్నారు "

"బ్రాహ్మలంతాచేరి కుట్ర పన్నుతున్నారు "

"కాదు; కమ్మవారంతా కలిసి గందరగోళం చెస్తున్నారు "

సంఘర్షణ ఇంకా దక్షయజ్ఞంలోకి దిగలేదు. ఇంకా వాగ్వాదసమరరూపంలోనే (Cord war) ఉంది. పాపం, ఏ మాట కామాటే చెప్పాలి ఆ రంగయ్యగారు ఎంతైనా వుత్తముడు కాబట్టి, అమాంతంగా సభామధ్యంనుండి లేచి, వేదిక వరకూ చేరుకుని, బహు వినయంగా చేతులు జోడించి "నేను అధ్యక్షపదవికి సిద్ధంగా లేనం"టూ ప్రకటించి, సంఘర్షణ సాయుధ రూపం ధరించకుండా కాపాడాడు. లేకపోతే సభ్యుల్లో ఒక రిద్దరి బుర్రలైనా బ్రద్దలయ్యేవి.

సమావేశంలో వ్యవహారంఅంతా ముదిరిపోయింది తాత్కాలికంగా సభ్యులంతా శాంతంగా కనిపించినప్పటికీ, వాళ్ళ చూపుల్లో కోపాలు పరుగులిడుతూనే వున్నయ్. సంస్థ సంరక్షణ దృష్ట్యా, అధ్యక్షుని ఎన్నికల్ని వాయిదా వేద్దామని, పెద్ద మనిషి కోరాడు. అందరూ అంగీకరించారు. సమావేశం వాయిదా పడింది.

* * * *

మళ్ళీ నెల తరువాత సభ్యులమైన మేమంతా తిరిగి సమావేశమయ్యాం, అదే టౌన్‌హాలులో. ఈతడవ అధ్యక్షుని ఎన్నిక ఏ విధంగానైనా జరిగిపోగలదన్న ఆశ మా అందరిలోనూ వుండింది. కాని జరగలేదు!

ఈ తడవ వచ్చిన పేరు గుప్తగారిది.

(39-వ పేజీ చూడుడు)

నవల :




శ్రీ నోరి నరసింహశాస్త్రి

## ౨౧

"కేకేమూర్జర జగదోసి సమరే, లంపాక కిం కంపసే?
వంగ త్వంగసి కిం ముధా? బర్బరజడ కాణోఽసి కిం కొంకణ
ప్రాణత్రాణగాయణో భవ మహారాష్ట్ర పరాష్ట్రీస్వమీ
యోద్ధారో వయ మిత్యరీ న భవం త్యంధ్రక్షమాభృద్భటాః"

ప్రతాపరుద్రీయమ్

దేవగిరి యాదవులే తమ్ము మహారాష్ట్రుల మని చెప్పుకొనుటయు గలదు మహారాష్ట్రులలో నొక భాగమువారు దేవగిరి యాదవులు యాదవసైన్యములు ఏకశిలానగరము ముట్టడించునని ముందుగనే అన్నమంత్రికి తెలిసియుండెను అతఁడు పుట్టకోట చుట్టు నున్న కందకము నీటితో నింపియుంచెను, పుట్టకోట గోడలపై యథాశక్తిగా రక్షకభటుల గాపుంచెను కాని పుట్టకోటను దీర్ఘకాలము రక్షించుట సాధ్యము కాదు!

పుట్టకోటగోడ నిడివి నలుదెసల గలసి రమారమి రెండు యోజనములు కలదు కోట రక్షించుటకు శిక్షితులైన భటులు ఐదువేలమందికంటె లేరు వారికి ఇప్పుడు క్రొత్తగా ఆయుధ సాధనమాత్ర మభ్యసించిన యొదువేలమంది బ్రాహ్మణవీరులు తోడు కాగలరు కాని వా రెంతమాత్రము పోరాడగలరో? రక్తమాంసములతో బీభత్సముగా నుండు రణరంగమునకు వారు అలవాటు పడగలరో, లేదో? వారు గాక ఏడెనిమిదివేలమంది వీరశైవులు ఇప్పుడు యుద్ధభటు లగుటకు అంగీకరించినారు కాని వారు పలువురు కోట నిర్మించుటకు వచ్చినవారు వారికి పలుగులు, పారలు, ఉలులు, బాడిసలు, కాణాములు, సుత్తెలు పట్టుటలో నేర్పు కలదు గాని, రణసాగరములకు వారు క్రొత్తవారు మరియును వారలు ఆవేశపూరితులు! ఆజ్ఞలు సక్రమముగా సురక్షితముగా పాలించు నభ్యాసము వారింకను అలవరచుకొనవలసి యున్నది ఇట్టి సేనతో సుశిక్షితములగు మహారాష్ట్రసేన నెదిరించు టెట్లు? మహారాష్ట్రసేన మూడు లక్షలకు తక్కువ లేదు దానిని నడుపుచు యాదవప్రభు వగు మహాదేవుడే స్వయముగా వచ్చియున్నాడు ఎంత నిబ్బరము లేనిది అతడు స్వయముగా వచ్చును?

పుట్టకోటను రక్షించుటలో మరియొక ప్రమాదముకూడ గలదు పుట్టకోటకును లేచుచున్న రాతికోటకును మధ్యనే సైనుల నివాసము లున్నవి అచ్చటనే విదేశీయు లగు కర్ణాటులయు యవనులయు మహారాష్ట్రులయు కళింగులయు నివాసములును ఉన్నవి అట్టి సంశోహాగ్యులను వెనుక నుంచుకొని కోటగోడలు రక్షింప దొరకొనుట ఎంత అపాయకరము పని?

ఐనను అన్నమంత్రి యిటు నిశ్చయించెను సుశిక్షితసైన సేనలు పుట్టకోటను ముందు రక్షింపబూనుకొనవలెను సందులు గలిగి యసంపూర్ణముగా నున్న శిలాప్రాకారము, సెల్లో సందులు పూడ్చి, వీరశైవయోధులు రక్షింప దొరకొనవలెను రాజప్రాసాదముచుట్టు నున్న శిలాప్రాకారమును బ్రాహ్మణయోధులు కాపాడవలెను పుట్టకోట యోగనప్పుడు దాని వదలి యచ్చటి భటులు శిలాప్రాకారము చేరికొనవలెను అదియు సాధ్యము కానప్పుడు వారును వీరశైవభటులును లసి రాజప్రాసాదము చేరికొనవలెను ఇట్లు రాజప్రాసాద మైనను నెలరోజులపాటు రక్షింపబడినచో భయము లేదు అప్పటికి తమ సేనల సహాయము తప్పక చేకూరును కాని యిన్నాళ్లు ఈ కోట నిలుచుట కష్టసాధ్యము! అదే అన్నమంత్రి కున్న బాధ!

మహారాష్ట్రసేనలు ఒక్కనాడు మాత్రము స్థావరము లేర్పాటు చేసికొనుచు పోరుకు దిగకుండెను కాని మరునాటి యుదయమున చీకటి యుండగనే, వారు కోట పట్టుకొనుటకు తలపడిరి కోటగోడలపై భటులు పలుచపలుచగా నుండుట వారు నిర్లక్షించిరి దానితో వారికి వచ్చిన వార్తలు ధ్రువపడెను మొదటినాటి సాయంత్రమునకు వారు పలుచోట్ల కందకము పూడ్చివేసి కోటగోడలు దరియుటకు దారులు చేసికొనిరి మరునాడు తెల్లవారునప్పటికి వా రాదారులు దృఢపరచిరి

నాగదేవనాయకుడు ప్రసాదాదిత్యనాయకుడును దనకు సహాయముగా, అన్నమంత్రి స్వయముగా కోటగోడలను పరీక్షించుచు శత్రుసేనల శక్తిసామర్థ్యముల నుపలక్షించుచుండెను అన్నమంత్రి కెంపు దృష్టులతో నది తిలకించుచుండెను ప్రస్తుతము వారి నాపు టెట్లు? ముందు తగినంత బలము వచ్చినప్పుడు, వారిని నిర్జించు టెట్లు? అన్నమంత్రికి బాలవీరు లిద్దరును పార్శ్వరక్షకులుగా నుండి యాతని నిరతము ననుసరించుచుండిరి

ఐదవనాటికి పుట్టకోట రక్షించుట సాధ్యము కాదని ధ్రువపడెను ఆ రాత్రి పుట్టకోటగోడలపై నన్నమంత్రి యాజ్ఞానుసారముగా నార్భాట మెక్కువగా భటులు చేయసాగిరి ఇది యేమని శంకించి మహారాష్ట్రులు వెనుకనుండి యెక్కువ సేనలు వచ్చువరకు గోడలపై నెక్కుటకు సాహసింపలేదు! ఆ వ్యవధిలో చీకటి మాటున ఆంధ్రసేనలు పుట్టకోట వదలి శిలాప్రాకారము వెనుకకు చేరికొని వీరశైవభటులను గలసెను

ఇంత యాకస్మికముగా నంధ్రసేనలు పుట్టకోట విడిచిపోవుట

మహారాష్ట్రసేనల కాశ్చర్యమయ్యెను ఇందులో నేదో మర్మమున్నదని శంకించి వారు వెంటనే గోడలపై నెక్కి యాక్రమింప సాహసంపలేదు అట్లు వారికి హస్తగతములైన పుట్టకోటగోడలను రెండు దినములవరకు వా రాక్రమించుకొనలేదు ఎక్కడనే గోతులు త్రవ్విరో యని బహుజాగరూకులై వారు ముందుకు సాగిరి

పుట్టకోటకును శిలాప్రాకారమునకును మధ్య నున్న ప్రదేశము నవగతము చేసికొని యందులో పోరున కనువుగ తమ సేనల స్థాపించుటకు మహారాష్ట్రులకు మరి రెండురోజులు పట్టెను ఆ పిమ్మట నూతనోత్సాహముతో వా రలా యసంపూర్ణ మగు శిలాప్రాకారమును ముట్టడించిరి

ఈ శిలాప్రాకారములో సందు లున్నవి ఆ సందులలో నిలిపిన యడ్డంకులు దృఢమైనవి కావు ప్రాకారమే కొన్ని యెడల పైకి లేవలేదు అట్టి యెడల దాని నెక్కుగా చేయుట కుపయోగించిన సాధనములును గట్టివి కావు అయిన నేమి? ఈ శిలాప్రాకారమున్నంతవరకు దుర్భేద్యమైనది పుట్టకోటకంటె పొడుగు తక్కువ, దీనిని రక్షించుచున్న సైనికుల సంఖ్య ఎక్కువ అన్నిటికంటెను వీరశైవ సాధుల యావేశము దుర్భరముగా నున్నది సామాన్య సేనలకు నేర్పు ఉండును గాని, యంత రణోత్సాహ ముండదు

ఆంధ్రభటులు కోటగోడలపైనుండి గురి తప్పకుండ బాణములు వేయుచు యాదవవీరుల పలువుర గూల్చుచుండిరి గోడల సమీపమునకు వచ్చినవారిపై శైవవీరులు శిలావర్షము కురిపించుచుండిరి అట్లు వర్షించుటకు శిలలకు కరవు లేదు శిలాప్రాకారము పూర్తి చేయుటకు సిద్ధపరచియున్న శిలలన్నియు నిప్పుడు శత్రుసేనపై ప వేయుట కనువుగా నున్నవి అసంపూర్ణముగా నున్న ప్రాకారపు సందులలో యాదవులు తమ గజబలమును ప్రయోగించుచుండిరి ఆ గజములమీద కోటగోడలపై నుండి సలసల కాచిన జలమును నూనెయు వీరులు పోసి నొప్పించుచుండిరి

శిలాప్రాకారము నొద్ద పోరులో నొక క్రొత్త చిక్కు వచ్చెను పుట్టకోటయొద్ద పోరు సాగుచుండగనే రెండు ప్రాకారముల మధ్య నివసించు విదేశీయులలోనను జైనులలోనను కలవరము ప్రారంభమయ్యెను అప్పుడది తీవ్రతరమైనది అది యొక మహాప్రవాహమునే అనుకరించుచుండెను జైనుల వసదిని మహాశివరాత్రినాడు అన్నమంత్రి పట్టుకొనినపు డక్కడ సిద్ధనంద్యాచార్యులు తప్ప మరి యెవ్వరును లేకుండిరి గదా! ఆ మరునాడే సిద్ధనంద్యాచార్యులను భటులు ఆదరముతో రాజప్రాసాదమునకు తీసికొనిపోయియుండిరి పుట్టకోట విడుచునాటికి ముందుగనే రాజభటులు అన్నమంత్రి యాజ్ఞలతో వసది వ్యవహారాలలో తగులబెట్టబడకుండ మిగిలిన పత్రములను రాజభవనమునకు చేర్పించి కార్యభరణుడగు దామనామాత్యుల వ్యవహారశాలలో పదిలము చేసిరి ఇది జైనులలో విప్లవకారులకు వంక యయ్యెను

"రాజభటులు జైన వసదిపై దండెత్తి వసది తగులబెట్టిరి మహానుభావుడగు సిద్ధనంద్యాచార్యులనుగూడ బంధించినారు అప్పుడు వసదిపత్రములను ద్రవ్యమును హరించినారు, ఈ రాజ్యమును మనము ధ్వంసము చేయవలెను! జయ హరిహరదేవరాజ! జయ మహారాష్ట్ర మహాదేవరాజ!"

ఈ విధముగా విప్లవకారులగు జైనులు ప్రచారము సాగించిరి అందులో ముఖ్యుడు నాగాచారి సామాన్యజైనులు పలువురు ఈ ప్రచారమునకు వశులై, స్త్రీ బాల వృద్ధులను విచక్షణకూడ లేక, చేతికి దొరికిన యాయుధములు ధరించి శిలాప్రాకారముపైకి విజృంభింపసాగిరి మహారాష్ట్రులును ఈ వీలు గమనించి అపాయకరమైన ప్రదేశములందెల్ల వారినే ముందుంచి యుద్ధయాత్ర సాగించిరి ఇందువల్ల మహారాష్ట్రసేనకు నష్టము తగ్గిపోయెను.

కాని జైనులందరు ఈ విప్లవవచనములకు వశులు కాలేదు వారిలో పలువురు కాకతీయరాజన్యుల రక్షణతో తరతరములుగా నీరాజ్యములో కాపురములు చేయుచున్నారు వారికి రాజకీయములతో పనిలేదు సుఖముగా ఎవరి సంసారయాత్ర వారు చేసికొనుటే వారికి ప్రధానము "ఎవ రెంత చెప్పినను జైనులైనంత మాత్రమున రాజభటు లెవ్వరికి నన్యాయము చేసియుండలేదు దుర్మార్గము చేసినవారిని రాజభటులు శిక్షింపకుందురా? నగరనాయకులనందర వధించుటకు కుట్రచేసిన వసదివారిని ఏ ప్రభుత్వము వదలిపెట్టును?" ఈ విధముగా వారు తలంచుచు ఆ యలజడులలో జోక్యము కలిగించుకొనకుండిరి కాని వారి కచ్చట నిలుచుట సాధ్యము కాకున్నది వారిలో కొందరు నగరము విడిచి చుట్టుపట్టుల తమ యాత్మీయు లున్న ప్రదేశములకు తలదాచుకొన బోయిరి కాని యందరకు నట్టి యాప్తులు లేరు అట్టివారు శిలాప్రాకారములోనికి రానిమ్మని రాజభటుల నర్థించుచుండిరి ఏమి చేయుట? నమ్ముటా! వీరిని నమ్మకుండుటా? ఇట్లు శరణార్థులై వచ్చినవారిలో వీరభల్లట దేశికుడును గలడు వీరభల్లటదేశికుడు ప్రసిద్ధుడు గనుక వెంటనే అతనికి లోనికి రా ననుజ్ఞ వచ్చినది కాని పలువురు అల్లాడి పోవుచుండిరి అట్లు లోనికి వచ్చుట కనుజ్ఞ రానివారు ఆంధ్రరాజును తిట్టి దూరము తొలగుచుండిరి హరిహరదేవరాజుకు జయ జయ నినాదములు చేయుచుండిరి

శిలాప్రాకారము మరి రెండు దినములకంటె నెక్కువ కాలము మహారాష్ట్రుల ధాటికి నిలువలేదు తత్ప్రాకారరక్షకులు వెనుకకు తగ్గి రాజప్రాసాదము చుట్టు నున్న ప్రాకారరక్షణకు అక్కడ నున్న బ్రాహ్మణవీరులతో కూడి పూనుకొనిరి రెండు ప్రాకారములు దాటిన తర్వాత మహారాష్ట్రసేనల యుత్సాహ మెక్కువయ్యెను ఆంధ్రవీరులకు గుండెలు జారిపోయెను అప్పుడు స్వయంభూదేవుని యాలయమునే ఎట్టి రక్షణయు లేకుండ వదలవలసి వచ్చినది

రాజప్రాసాదము చుట్టు నున్న ఆవరణము మిక్కిలి చిన్నది అందులోనికి ఇప్పుడు మహాప్రధానులయు నగరనాయకులయు కుటుంబములగూడ చేర్చవలసివచ్చినది అందరతో పాటు, అన్నమంత్రీశ్వరుని తల్లి గౌరమ్మయు, పత్నులగు పార్వతమ్మ లకుమమ్మలును, కూతురు బాలయు, రాజభవనము చేరికొనిరి తిక్కనసోమయాజియు సోమిదేవితో నందు చేరికొనెను గురునాథునకు మారనకు బ్రాహ్మణవీరులకు శిక్షణ నొసగుటతో తీరిక లేకున్నది అన్నమంత్రి మాత్రము తన బందసాల వదలలేదు అదియే ప్రస్తుత మాతని దివాణము! అతడు శ్రీ రుద్రదేవమహారాజును గూడ దర్శింపక, తనపై బడిన కార్యభారము తీర్చినపిమ్మట దర్శింతునని వ్రాతమూలమున నివేదిక పంపుకొనెను మహారాజందులకు సమ్మతి తెలిపెను

రాజప్రాసాదముచుట్టును భయంకరముగా యుద్ధము రేగుచున్నది రాత్రింబవళ్ళు విధివిరామము లేకుండ స్త్రీపురుషులందరు ఏదో ఒక విధమున పోరాడుచున్న యోధులకు సహాయపడుచుండిరి ప్రాసాదములోపలను బయటను మహాకోలాహలమే వినవచ్చుచున్నది మహారాష్ట్రసేనలు మాటిమాటికి హరిహరనాదునికి జయశబ్దములు చేయుచుండుటచేత ఆ సైన్యముతో రుద్రమ సవతికుమారుడగు హరిహరు డున్నట్లు విశదమయ్యెను

అప్పటికి కొంతకాలమునుండి గౌరమ్మ తిక్కనసోమయాజుల నర్థించి వారు రచించుచున్న ఆంధ్రమహాభారతము వినుచుండెను పూజ్యురా లగు నామె పలుకులచేత రాజమందిరమున గల స్త్రీజనమునందంతటను శ్రీమహాభారతప్రశంస ప్రాకిపోయి

నది శ్రీమహాభారతము కల్పవృక్షమే! అది యొక ధర్మశాస్త్రము నీతిశాస్త్రము! అదియే అధ్యాత్మవిద్య! శ్రీరుద్రదేవ మహారాజులకుగూడ ఆ ప్రశస్తి వినవచ్చినది ఆనాడు స్వయంభూదేవాలయములో తిక్కన సోమయాజుల భారతభాగము విన్నదాది ఆమెకు కలకగా నున్నది కల్పవృక్షము వర్థించి నన్నే కోరిక నెరవేరదు? "రాజనీతివిశేషము లేవి? శత్రురాజుల జయించు తెరంగేమి? ఈ ప్రశ్నలకు మహాభారతములో నుత్తర ముండునా?" యని శ్రీరుద్రదేవమహారాజులకు ప్రశ్న కలిగెను ఆనాటి రాత్రియే పనులన్నియు సర్దుకొని తీరిక చేసికొని రుద్రమ్మ, గౌరమ్మ ఏకాంతమందిరమున కేగి సోమయాజుల నట్టి భాగ మున్న వినిపింప వేడెను

సోమయాజులు చిరునవ్వు నవ్వుచు, "అమ్మా, ఈనాడే ఆ భాగము వ్రాసినాను అవధరింపుడు!" అని ఇట్లు వినిపించెను రుద్రమ యాశ్చర్యముతో నాలకించెను

"ధృతరాష్ట్రుడు ధర్మజునకు రాజనీతివిశేషంబులు సెప్పుట

"నీవు నిచ్చలును విద్యావృద్ధజనముల
దగ నుపాసింపు, మర్థముల వారి
ప్రీతుల జేయుము, నీతులు వా రుప
దేశింప వాని నూదిన మనంబు
గలిగి నిర్వర్తింపు కార్యంబు, నింద్రియం
బుల రాజ్యతంత్రంబు బోలె నరసి
రక్షింపు, మప్పిండు రక్షితంబైన శు
భంబులం గావించు, భావశుద్ధి

ధామములును బితృపితామహాక్రమసమా
గతులు విశదమతులుగాగ వలయు
సచివు, లతి విదగ్ధచారుల బనుపుము,
పరుల యాప్తజనులభేదింప లరయ

"పురరక్షణము దృఢంబుగ,
నరవర చేయంగవలయు నమ్మంగలుగు న
త్పురుషుల నిడందగు గుడుపు ని
దుర మొదలగులోని పనుల తోడరువు లరయన్.

న్యాయంబుతోడ వివిధో,
పాయంబుల నర్థముల నుపార్జింపుము భూ
నాయక రాజ్యవిఘాతము,
సేయుజనుల నెఱిగి చంపం జెఱపనవలయున్.

నీవలనను భక్తిస్నేహా
వేశము గలిగి శూరుండై యలజడికిం
దా విసువని సత్కులజుం,
గావింపుము సైన్యవిభునిగాం గురుముఖ్యా!

"ధృతరాష్ట్రుడు ధర్మజునకు శత్రురాజుల జయించు తెఱంగు సెప్పుట"

"శుశ్రువనిచ్చ తఱియుం గురువర క్రిక్కించు,
నవసరంబు నెఱిగి యరినృపాలు
నీవు ధీరవృత్తి నిశుంద్రాటం బోనిమ్మ,
క్రమ్మ కపిల యనగ గ్రమ్మిచెఱపు

సంపదల నాపదల నొక్కచంద మగుట
విక్రుతి నొందుట యా బలశితులందుం
గాంచి యెల్లప్పుడును హితకారి యైన
బళ్లను నెక్కడుగా బ్రోవు భరతముఖ్య.

వినికి గలిగి రక్షించుచు,
ననువున దయతోడి పాడి నాయతు లెల్లం
గొనుచు దగనేలి పొగడొం
దిన రాజున కుర్వి గామధేనువ కాదే!"

అట్లు విని కౌశపూజ గావించిన సువర్ణాక్షతలు తిక్కన సోమయాజులు స్వహస్తదత్తంబులు, భక్తితో శ్రీరుద్రదేవమహారాజులు శిరస్సున గ్రహించి సెలవు తీసికొని నిజమందిరమున కేగెను

---

## మన రైలుమార్గాలు :

భారతదేశంలో రైలుమార్గం మొట్టమొదట వెయ్యబడినది 1853 ఏప్రిల్ లో అది బొంబాయినుంచి థానాకు (22 మైళ్లు) నిర్మించబడింది

మొట్టమొదట ఎలక్ట్రిక్ రైలు 1925 లో బొంబాయి విక్టోరియా టెర్మినస్ నుంచి కుర్లాకు నడిచింది.

భారతదేశంలో కెల్ల పెద్ద రైలుమార్గం ఈస్ట్ ఇండియన్ రైల్వే

టిక్కెట్లు లేకుండా టికెట్ ఎగ్జామినర్లు టికెట్ కలెక్టర్లు పట్టుకుంటారనే బెంగ లేకుండా ప్రయాణం చేసేవారెవరు?

[సమాధానం మరొక పేజీలో]

ఒక రైల్వే ఉద్యోగి.

# తెలుగు టైపురైటరు



## [శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య]

దేశభాషలందు తెలుగు లెస్స' అనే కీర్తి తెలుగుకే దక్కింది. ఈ లెస్సగా పరిగణింపబడే తెలుగువారు ఇండియన్ యూనియన్‌లో హిందీతర్వాత స్థానాన్ని ఆక్రమించారు. 1950 జనసంఖ్య ననుసరించి నాలుగుకోట్లవరకు తేలుతారు. తెలుగులిపి అందమైన లిపి. తెలుగు నుడికారం మధురమైంది. తెలుగుదేశం సర్వసంపదలు కలిగింది. ఆంధ్రజాతి తన గౌరవాన్ని నిలుపుకోవలెనంటే ఆధునిక పద్ధతులను అన్వయించుకొని తన జాతిసంస్కృతిని కూడా పెంపొందించుకోవాలి.

ఒక జాతిసంస్కృతికి ప్రధాన సాధనం భాష. ఈనాడు ప్రాంతీయభాషలకు రాజపాలనలో, శాసనసభానిర్వహణలో నిత్య రాజకీయవ్యవహారంలో, విద్యావిధానంలో ప్రాధాన్యం యివ్వవలెనని యోచనలు, ఆందోళనలు సాగిస్తున్నాం. ఈ పారిశ్రామిక యుగంలో సమయం, స్థలం చాలా ప్రధానంగా వుంటున్నవి. భాష పూర్వపు వ్రాతరోజులనుండి అచ్చుయంత్రాగారాలు వచ్చినతర్వాతనే అభివృద్ధిపొందిందని అందరూ అంగీకరించేదే. ఇంగ్లీషు ఇతరభాషల పత్రికలలో వచ్చినంత దీర్ఘంగా, త్వరగా మనకు వార్తలు అందడంలేదు. పట్టుమని 50 వేల అమ్మకంగల తెనుగుపత్రిక లేదు. ఇతరభాషలన్నీ తమతమ లిపిని సంస్కరించి టైపురైటరులు లైనో టైపురైటర్లు నిర్మించుకుంటున్నా. మన అచ్చు పాతపద్ధతిలో ఒక్కొక్క అక్షరం యేర్చి కూర్చుకోవడంలోనే వుంది. మనం వ్రాసుకోవడం ప్రాత ఔరంగజేబు దస్తూరిప్రాధాన్యంతోనే వుంది. కాలం స్థలం ఎంత తగ్గితే అంత మంచిదని తలచుచున్న ఈ రోజులలో కాలమును, స్థలమును సరిపుచ్చుకొనుటకు అవసరపు పనులకు ఇంగ్లీషుభాషనే వాడుతున్నారు. ఇంగ్లీషు టైపురైటరుతో ప్రక్కబస్తీకైనా, తెలుగు తెలిసిన అధికారికైనా జాబులు వ్రాస్తున్నారు. అందువలన గుమాస్తాగిరికి తయారయ్యేవారు ఇంగ్లీషుకే ప్రాధాన్య మియ్యవలసివస్తున్నది. అందువల్ల మాతృభాషపై ఉండవలసినంత మమత వుండియు విద్యార్థిలోకం తెలుగువిషయంగా కృషిచేయలేకపోతున్నారు. తెలుగుభాష అభివృద్ధి బడయలేకపోతున్నది. స్వయంగా ఆంధ్రాభిమానం గలవారు కూడా ముందుకు సాగలేకపోతున్నారు.

ఇందుకు ముద్రాలేఖిని లేని లోటు ఎంతైనా కన్పించింది. ఈవిషయమై నిరంతరబాధతో ఎట్టకేలకు రాయల్ టైపురైటరు నుండి చిన్నమాంబాముద్రాలేఖిని ఒకటి తయారుచేయబడింది. అటులే అండర్‌వుడ్ టైపురైటరువారు ఇంగ్లీషు తెలుగు కలిపి ఒకేసారి టైపు చేయుటకు వీలుగా ఒక మిషను తయారుచేయించారు.

ఈ చిన్నమాంబాకూడా లైనో టైపుకు అందుబాటుకానేలేదు. లైనో టైపు తయారుచేయించవలెనని శ్రీ దేశోద్ధారక నాగేశ్వరరావుగారున్నపుడు శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మగారి ద్వారా కొంత కృషి జరిగింది. తెలుగు టైపు రైటరుకుమిషను ఫలకం (కీబోర్డ్) కై శ్రీ యం. యన్. వెంకయ్యగారు, శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు, శ్రీ రాజా పానుగంటి పార్థసారథిగారు, కొంత కృషి చేశారు.

హైదరాబాదులో శ్రీతాడూరి లక్ష్మణాచారిగారు 'కూచి' ముక్తాలేఖినిని తయారుచేసి, బెంగుళూరుప్రదర్శనంలో చూపినపుడు అచటివారి కర్నాటక్ అభిమానంలో ఇది వెనుకబడిపోయింది. 'దీనిని ఈనాడు హైదరాబాదు ఆంధ్రసారస్వత పరిషత్తువారు ప్రోత్సహించి కొంత సాధనకై ప్రయత్నిస్తున్నారు.

ఉన్న యంత్రాలలోనే కొంత మార్పు చేస్తే స్పీడ్‌కూడా సాధించవచ్చునేమోననే ఆలోచనలో వున్నా ఇంతకన్నా వేరే పద్ధతిలో ఇంతకన్న సంస్కరణలు చేసి సాగించితే బాగుంటుందనే కొందరు పరిశోధకులు అభిప్రాయపడుతున్నారు.

శ్రీ చిలుకూరి నారాయణరావుగారు కీబోర్డును ఒకటి కనిపెట్టినారని అది ఎవరికి చూపకుండా తామే పరిశోధన చేస్తున్నారని తెలుస్తున్నది. ఇంతే కాక ఎందరు విజ్ఞులు ఆంధ్రభాషాభిమానులు తెలుగు టైపురైటరు, కీబోర్డుల పరిశోధనలో నిమగ్నులైయున్నారో తెలియదు. తప్పకుండావుంటారు; వున్నారు.

ఈ విధంగా ఎవరికి వారు ఒక రూపానికి తీసికొనిరావడం వారి ప్రయత్నంలో సాధ్యమైనా, అసలు మిషను తయారుచేయబడి కార్యాచరణలో సాధ్యాసాధ్యాలు గమనించే అవకాశం లభించలేదు.

ఈ ప్రయత్నాలే కాక ఆంధ్రభాషలోకి ఒక లైనో టైపు మిషను చాలాకాలంక్రితం తయారుచేయబడిందని విన్నాను. అవి రెండు మిషనులు ఇండియాకు వచ్చినట్టు ఒకటి హైదరాబాదు ప్రభుత్వమున్నూ, రెండవది మద్రాసు ప్రభుత్వమున్నూ కొన్నవని తెలుస్తున్నది. మద్రాసు ప్రభుత్వం దానిని వాడడం లేదని, హైదరాబాదు ప్రభుత్వం యిప్పటికీ వాడుతున్నదని, దానితోనే నేటి హైదరాబాదు (ప్రభుత్వ ప్రచార పక్షపత్రికను) ముద్రించుచున్నారని వింటున్నాను. స్వయంగా చూసే అవకాశం లభించలేదు. మద్రాసు ప్రభుత్వం కొన్నది నిజమో కాదో కాని, కొన్నది నిజమే అయి మూలపడేస్తే మాత్రం అతిదారుణ విషయమే. ఏమైనా ఈ లైనో టైపు అంత అలవాటులోకి రాలేదనేది యథార్థం. అందుకు కారణాలేమో తెలిసికోవలసివుంది.

ఏది ఎటున్నా తెలుగులోకి టైపురైటరు వెంటనే రావడం అది లైనో టైపుకు అవకాశం కల్పించేదిగా వుండడం ఎంతేని అవసరం. తెలుగుభాష రాజకీయభాష కావాలెనంటే అన్ని ఆఫీసుల్లోనూ టైపుమిషనులుండాలి. సామాన్య వ్యాపారులుకూడా తమ ఉత్తర ప్రత్యుత్తరాలు తెలుగులో జరుపుకుండేటట్టు చేసినపుడే తెలుగులో చదువులు సాధ్యమవుతవి. ఆవిధంగా అందరు తమ ఉత్తర ప్రత్యుత్తరాలు ఆంధ్రప్రాంతంలో వానినైనా.

(37-వ పేజీ చూడుడు)

---

**మన రైలు మార్గాలు :**

ప్రశ్నకు సమాధానం : మూడేళ్ళకులోబడిన పిల్లలు.

# తమిళలిపికి సరికొత్త లైనోటైపు

తమిళలిపికి లైనోటైప్ (అచ్చుకూర్పు) యంత్రాన్ని తయారు చేయటంతో మరొక అడుగు ముందుకు సాగింది. ఒక సరికొత్త అచ్చుకూర్పు యంత్రం ఇప్పుడు అమెరికానుంచి మద్రాసుకు వస్తూవుంది. నేటి వరకూ ఈకార్యక్రమంలో జరిగిన యావత్తు కృషికీ ఇది మేర. స్థానిక ప్రచురణ కర్తలూ అమెరికా సాంకేతికనిపుణులూ జరిపిన సంయుక్తకృషికి ఇది ఫలితం.

ఈ యంత్రాన్ని నిర్మించటంలో ప్రధానంగా సహాయపడ్డవారు డాక్టర్ నార్మన్ బ్రౌన్. ఈయన పెన్సిల్ వేనియా విశ్వవిద్యాలయంలో సంస్కృత భాషాచార్యులుగా పనిచేస్తున్నారు. దక్షిణాసియా భాషల శాఖకు ప్రధానాచార్యులుగా వున్నారు. వీరు సింహళం నుంచి బొంబాయి వెళుతూ ఇటీవల మద్రాసుకు వచ్చారు. వీరివెంట, 'లైనోటైప్ అండ్ మెషినరీ కంపెనీ' తాలూకు భారతదేశంలోని శాఖకు మేనేజర్‌గా పనిచేస్తున్న టామ్‌కింగ్ గారు కూడా వీరివెంట వున్నారు. నార్మన్ బ్రౌన్ మద్రాసు మకాంలో వుండగా తమిళలిపికి వున్న సాధకబాధకాలను గురించి పలువురు ప్రముఖులతో సంప్రదించారు.

విశ్వవిద్యాలయంలో తనకు వున్న బాధ్యతలు అలావుండగా బ్రౌన్‌గారు అమెరికాలోని 'మెర్గన్ తాలర్ లైనోటైప్ కంపెనీకి' సలహాదారుగా కూడా పనిచేస్తున్నారు. వీరు చాలాకాలంనుంచీ భారతదేశపు భాషా సమస్యలపట్లా, ఆ యా భాషలకు అచ్చుకూర్పు యంత్రాలను నిర్మించేపట్లా, చాలా శ్రద్ధతో పనిచేస్తున్నారు.

నిజానికి ఈయనకు బాల్యంనుంచీ యీ రంగంలో అభిలాష వుంది. ఈయన భారత దేశంలోనే పెరిగారు. జబల్‌పూర్‌లో ఈయన తండ్రిగారికి ఒక అచ్చాఫీసు వుండేది. ఈయనకూడా ఈ ప్రెస్‌లో పనిపాటలు చేస్తూ, చేత్తో టైపులు కూర్చే పద్ధతినీ, ఇంగ్లీషుభాషకంటే దేశీయ భాషలకు ఎక్కువ గళ్ళు వుండటాన్నీ గమనించారు.

అమెరికా వెళ్ళినతరువాత కాలేజీలో చదువుకుంటూ, వేసవిశెలవుల్లో ఒక అచ్చాఫీసులో ప్రూఫ్‌రీడరుగా పనిచేస్తూ వుండేవారు. ఆ ఆఫీసులో అన్నీ లైనోటైప్ యంత్రాలే వుండటం, తొందరగా పని సాగుతూవుండటం ఆయన గమనించారు.

బి. ఏ., ప్యాసయిన అనంతరం సంస్కృతభాషలో బాగా ప్రవేశం సంపాదించి, ఈయనా ఈయనతండ్రిగారూ కూడా, జాన్సు హాప్‌కిన్సు విశ్వవిద్యాలయంలో వేదాంతశాఖలో డాక్టరేట్ బిరుదాన్ని సంపాదించారు. అప్పటినుంచీ లిపి సంస్కరణోద్యమంలో వీరికి గల అభిలాష మరింత యినుమడించింది.

ఇది గాక, వీరు 'అమెరికన్ ఓరియంటల్ సొసైటీ' పత్రికకు సంపాదకుడుగా పనిచేస్తూ ప్రాచ్యభాషలనుంచి ఉటంకాలు ముద్రించవలసివచ్చినప్పుడు నానాబాధలూ పడుతూ వుండేవారు. సులభంగా చదవటానికి వీలుండే లిపిగనుక అయితే చాలామంది చదవటానికి సావకాశం వుంటుందనే విషయాన్ని కూడా యీయన అర్థం చేసుకున్నారు.

దేశంలోని నిరక్షరాస్యతను త్వరలో నిర్మూలించటానికి ముద్రణలో అధునాతన పద్ధతులు అవలంబించటం చాలా ప్రయోజనకరంగా ఉంటుందని బ్రౌన్ విశ్వాసం.

“భారతదేశంలోని వివిధ భాషలూ, దేశకాలపాత్రానుగుణ్యంగా అనేక మార్పులు పొందుతూనే వచ్చినై. మద్రాసు పురావస్తు ప్రదర్శనశాలలోని ప్రాచీన వ్రాతప్రతులను శాసనాలనూ చూస్తే యీ విషయం విస్పష్టంగా బోధపడుతుంది. తెలుగు, కన్నడ, తమిళ, మళయాళ లిపులన్నీకూడా, 500 సంవత్సరాలనాటి లిపులకూ ఇప్పుడు వాడుకలోవున్న వాటికీ యెంతో తేడాలున్నయ్. ఇంకా వెనక్కు అశోకుని కాలంవరకూ పోయి చూస్తే, మరింత తేడా కనిపిస్తుంది.” అని బ్రౌన్ అభిప్రాయపడుతున్నారు.

ఈ మార్పులు రావటానికి గల కారణాలు వివరించుతూ “ఉత్తర హిందూస్థానంలో పూర్వం, భూర్జపత్రాలమీదనూ చెట్లపట్టలమీదనూ కలమూ సిరా ఉపయోగించి వ్రాస్తూ వుండేవారు. అందుచేత అడ్డగీతలూ నిలువుగీతలుగావుండే దేవనాగరిలిపి పెంపొందింది. దక్షిణభారతంలో తాటాకులమీద గంటంతో వ్రాయటం అలవాటు వుండేది. అందుచేత గుండ్రని అక్షరాలుగల లిపులు పెంపొందినాయి” అన్నారు.

అచ్చుయంత్రాలు అమల్లోకి వచ్చిన అనంతరం, ఆయాలిపుల అక్షరరూపాల్లో చాలా మార్పులు బయలుదేరుతున్నయ్. సహజంగా యీ లిపులన్నీ యిప్పుడు 'లైన్' (సమరేఖా) విధానాన్ని అనుసరించవలసిన అవసరం వుంది. అలా జరిగితేనే గాని యంత్రాలను ఉపయోగానికి తెచ్చుకునే సావకాశం వుండదు. అచ్చుకూర్పటంలో, యంత్రాన్ని గనుక యిస్తే ఒక్కొక్క మనిషి మామూలుగా చేత్తో పని చేసే దానికంటే ఆరురెట్లు ఎక్కువపని చెయ్యాలడు. అంతేగాక ముద్రణ కూడా విస్పష్టంగా వుంటుంది. గంటకు వేలతరబడిని త్వరితగతిని ముద్రించే అచ్చుయంత్రాలమీద ముద్రించాలంటే చేతిమీద కూర్చిన టైపు అంతగా బాగుండదు.

యంత్రాలను ప్రవేశపెట్టటంవల్ల చాలా మందికి పనిలేకుండా పోతుంది, అనే వాదానికి సమాధానమిస్తూ, బ్రౌన్ ఇలా అన్నారు. “విరివిగా అచ్చువేయటానికి సావకాశం కలిగితే విరివిగా చదువరులు యేర్పడే సావకాశం వున్నది. తద్వారా యెక్కువమంది పనివారికి పనిపాటలు లభించే సావకాశం ఉన్నది”

“యంత్రాల ప్రయోగంవల్ల చాలా ప్రయోజనాలున్నా యంత్రాల నిర్మాణంలో మాత్రం చాలా సాధకబాధకాలున్నయ్. లైనోటైపుయంత్రంలో 90 కి మించి అక్షరమూర్తులను పెంచితే ప్రయోజనం ఉండదు. అలా చేస్తే తొందరగా పని సాగే సావకాశం తప్పుతుంది. సంయుక్తాక్షరాలకు క్రిందా పైనా వాడే గుర్తులను అక్షరం ప్రక్కలకు చేర్చి లిపిని సంస్కరించుకోవాలి. ఈ పద్ధతిని ఉత్తరప్రదేశ దేవనాగరలిపి సంస్కరణ సంఘంవారు సిఫారసు చేశారు. బెంగాలీ 'ఆనందబజార్ పత్రిక' ఈ సూచనను ఆచరణలో పెట్టింది” అన్నారు.

1934 లో తమిళభాషకుకూడా లైనోటైపు సృష్టించటానికి ప్రయత్నాలు జరిగాయి. 1935 లో యీ కార్యం నిమిత్తం బ్రౌన్ మద్రాసుకు వచ్చి కొంత కృషి చేశారు. అప్పట్లో ఒక లైనోటైప్ యంత్రాన్ని తయారుచేయించారు. దాన్ని అప్పట్నించీ, ఉపసంపాదకీయాన్ని ముద్రించటానికి “స్వదేశమిత్రన్” పత్రిక వాడుతున్నది. తద్వారా యీ లిపి సంస్కరణతో ప్రజలకు పరిచయం కలిగించటానికి ప్రయత్నించారు.

ఈ యంత్రాన్ని మరింత సంస్కరించి యిప్పుడు మరొక సరిక్రొత్త యంత్రాన్ని

(38-వ పేజీ చూడుడు)

బాలానందం:

# రెలెతెవార్త

మూలం:
ఆర్కాడీ గైడర్

అనువాదం:
కృష్ణ ప్రసాద్

ఆ మర్నాడు చుక్, గెక్, వాళ్ల అమ్మ బైలుదేరారు. బాగా చీకటిపడ్డతర్వాతగాని రైలుకదల్లేదు. కారునలుపు చీకటిలో కప్పాకుపోయిన ఆ కిటికీల్లోంచి ఏమంత చూడతగ్గవి కనిపించలేదు వాళ్ళకి.

మంచు పేరుకుంటున్న కిటికీ అద్దాలగుండా చంద్రుడు— మాస్కోలో కంటె చాలా పెద్దవాడిలా కనపడుతున్నాడు— అంటే రైలు ఏదో పెద్ద కొండ మీద కెక్కిపోతోందని, అక్కడ నించి చంద్రుణ్ని అందుకోవచ్చనీ నిర్ధారణచేసుకున్నాడతను.

రైలుఊగుతోంది. గాలి విసురుగా వీస్తోంది. ఆ పెద్ద చందమామ, ఆటలాడుతున్న గ్లాసుమీద, తెల్లనిగుడ్డమీదున్న ముదురు ఆకుపచ్చరంగు నారింజ కాయ మీద, నిద్రలో దేన్నిగురించో నవ్వుకుంటున్న వాళ్ళమ్మ మొహంమీదా నీలపు కాంతిప్రసరింప జేస్తున్నాడు. క్రమంగా వాళ్లకి నిద్రపట్టింది. గెక్ కిగూడా కొద్దిగా ఆలస్యంగా నిద్రపట్టింది...

"సందర్శించా డొక నవ్యస్వప్నం
"కదిలే మెదిలే రైళ్ళ కూతలూ,
"ఎక్కడ చూసిన జనుల మాటలూ,
"చక్రాలు చేసే చప్పుడు
"ఇంజను మోతలూ కలిశాయి.
"పదండి ముందుకు మిత్రుల్లారా!
"కారు నల్లని రాత్రంతా
"తెరువు మీదనే తిన్నగ ముందుకు
"చీకటి చించుకు పోవాలీ.
"భగభగ మెరిసే ఇంజను లైటా!
"దూరపు దారికి వెలుగిమ్మా.
ధనధన పోయే రైలు ఇంజనూ
"కూయిస్తే నన్నూ సత్తువ కొద్దీ.
"దొర్లుకుపొండీ చక్రాల్లారా!
"తూర్పు దిక్కుకి వేగంగా.
"నీలికొండపై నిలిచేదాకా
"పయనం మాత్రం ఆపకపద్దూ.
"అప్పుడు మన ఢణ గొణ శబ్దం
"ఒక్కసారిగా నిలిపేద్దాం."

మరునాడు రైలు ఒక చిన్న స్టేషన్లో ఆగింది. ముందుపిల్లలిద్దర్నిదించి, వాళ్ళమ్మ గబగబా సామాన్లు దించేసింది. నేచులన్నీ మంచుమీద కుప్పగా పడేశారు. ఆ చెక్క ప్లాట్‌ఫారమంతా కాసేపటిలోనే నిర్మానుష్యమైపోయింది. వాళ్ళనాన్న మాత్రంఎక్కడా కనిపించలేదు. వాళ్ళమ్మకి బలేకోపమొచ్చింది నాన్నమీద. సామాన్లు పిల్లల్నిద్దరినీ చూస్తూవుండమని చెప్పి బళ్ళవాళ్ళ దగ్గిరకెళ్ళింది. ఏబండి పంపించాగో తమకోసమని వెతుక్కుంటూ, ఇంకా అరవైమైళ్లు ఆనాచునేల మీదప్రయాణంచేయాలి వాళ్లుఆయనఉన్న చోటుచేరాలంటే.

ఇక్కడి మేకలు వేటికోసం వెతుకుతూ వుంటాయో తెలియదు.

వాళ్ళమ్మకేమి చేయడానికీ తోచలేదు. ఈలోపున అడవిమేక ఒకటి కనిపించింది. మంచు కప్పినదుంగల మీదగంతులేస్తు, చుక్కుగెక్కుల వేపుస్నేహంగా చూస్తోంది. బస్తాల చాటునదాక్కున్నారు వాళ్ళిద్దరూ.

వాళ్ళమ్మ వచ్చింది. "బహుశా మనమిచ్చిన టెలిగ్రాం అందుండదు. నాన్న బండిపంపలేదు." అంది వాళ్ళతో

బండివాడొకణ్ని పిలిచారు. కొరడాతో మేకపిపుమీదొకటి తగిలించి, సంచులు తీసికెళ్ళి స్టేషన్లో ఫలహారాలమ్మే చోట పెట్టాడు. ఆగదిచాలా చిన్నది. బల్లవెనకాల పెద్దరాగి బాయిలరు ఆవిరి గుప్పుగుప్పున వదుల్తోంది పైకప్పుకి తగిలేటట్టు. కొన్నిపిచ్చికలు బయటచలిబాధ పడలేక అక్కడ కూచుని వళ్ళుకాచుకుంటున్నాయ్.

చుక్కూ గెక్కూ టీ తాగుతుంటే, వాళ్లమ్మ బండివాడితో బేరంచేసింది. వాడురొట్టెలు, గడ్డి, గొర్రెచర్మం, దుప్పటీ తీసుకురావడానికి వెళ్ళాడు.

"మీ నాన్నగారికి మన మొచ్చినట్టే తెలియదు. మనల్నిచూడగానే విస్తుపోతారుకదూ?" అందివాళ్ళమ్మకొద్దిగా నిరుత్సాహంగా.

"నిజంగానే! ఆశ్చర్యపడటమే కాదు, సంతోషపడతారు కూడా" అన్నాడు చుక్, టీతాగుతూ

అవును! మనమేం చెయ్యాలంటే ఎలకల్లాగా చప్పుడు కాకుండా పాక్కుంటూ పోవాలి. నాన్నగారు ఎక్కడికన్నా వెళ్తుంటారు. గబిక్కున ఇంట్లోదూరి సామానంతా దాచేసి మంచంకింద దూరిపోవాలి. ఆయనవచ్చి, దేన్నిగురించోకీర్ఘంగా ఆలోచిస్తూ ఉండే సమయానికి—

ఒక్కసారి ఈలవేద్దాం!" అన్నాడు గెక్.

"నేను ఎవరిమంచం కిందా దూరను. కావాలంటే మీరు దూరి అరుచుకోండి" కోపంతో అంది వాళ్ళమ్మ. "చుక్! వెధవా పంచదార జేబులో నింపుతున్నావ్?"
"మన దగ్గిర డబ్బా ఉందిలే."

"గెక్! నువ్వు ఒక బన్‌రొట్టె తీసుకురారా!" "నువ్వేదీ తీసుకురావు—అన్నీ నన్నే అడుగుతావ్"

బండివాడు వచ్చేశాడు. సామానా వెడల్పుబండిలో పెట్టేశాడు. అడుగున గడ్డి పరిచి, కుఱ్ఱాళ్ళ నిద్దరినీ ఎక్కించి, గొఱ్ఱెతోలుదుప్పట్లు కప్పేశారు.

పట్టణాలకీ, ఫ్యాక్టరీలకీ, గ్రామాలకీ, గుడిసెలకీ-అన్నిటికీ వీడ్కోలు! ముందు రాబోయే వన్ని కొండలు, దట్టమైన నల్లవైన అడవులు.

* * *

వింతలు, సుందరదృశ్యాలు నోరుతెరుచుకుని చూస్తూ, చీకటి పడేదాకా కులాసాగా ప్రయాణం చేశారు. కొంతసేపైనాక ఏమీ తోచక, చుక్ వాళ్ళమ్మని రొట్టెనాన్న బిస్కట్టన్నా ఇవ్వమని అడిగాడు.

ఆవిడ ఏదీ ఇవ్వలేదు. కొద్దిగా సణిగి, ఇంక గెక్‌ని పొడుస్తూ, గిచ్చుతూ బండి చివ్వరికి తోయడం మొదలుపెట్టాడు.

మొదట గెక్ మాట్లాడకుండా అవతలకి తోసేసాడు. తరవాత వళ్ళు మండిపోయి చుక్‌ని ఒక్క టంటించాడు. చుక్ ఒక్క ఎగురెగిరి గెక్‌మీద పడ్డాడమాంతం. అయితే చేతులుమాత్రం దుప్పట్లో చిక్కుకు పోయుండటంవల్ల, ఒక రొన్నకరు తలల్తో పొడుచుకోవడం కంటె చేయగలిగిందేమీ లేక పోయింది.

వాళ్ళమ్మ వాళ్ళవంక చూసి నవ్వుకుంది. బండివాడు కొరడాతో గుఱ్ఱాల్ని అదలాయించాడు. అవి పరుగు లంకించుకున్నాయి. రెండు తెల్లటి కుందేలుపిల్లలు రోడ్డుమధ్య నుంచుని డ్యాన్సుచేయడం మొదలెట్టాయి. బండివాడు "బండి! బండి," అని అరిచాడు నవ్వుకుంటూ.

కుందేలుపిల్లలు ఎగురుకుంటూ, పొదలచాటుకు పరుగెత్తాయి. ఒక చల్లటి పిల్లగాలి వీచింది వాళ్ళ మీదుగా, చుక్కు-గెక్కు కుమ్మ కుంటుండగానే బండి క్రిందికి దిగింది గట్టుమీంచి. ఎదురుగా నీలపు కొండలమధ్య నుంచి చంద్రుడు ఆకాశంలో కెక్కుస్తున్నాడు.

బెట్టారు. బండివాడు ఎక్కడివో చితుకులు ఏరుకొచ్చాడు.

జున్ను గడ్డలు ఎంత గట్టిగా అయిపోయినాయంటే వాటితో గోడకి మేకులు కొట్టచ్చు. అవి కాస్త వెచ్చచేసుకుని, తరవాత రొట్టె కాల్చుకున్నారు.

పొయ్యిదగ్గిర తిరుగుతుంటే నీటి జలొకటి కనిపించింది. అది మృగాల్ని పట్టడానికి తవ్వబడిందని చెప్పాడతను. అది పాతపడిపోయి ఎందుకూ పనికిరానిదిలాగా ఉంది.

టీతాగడం అవగానే పడుకున్నారు. వాళ్ళు గోడ ప్రక్క పెద్ద దుప్పటి పరిచారు. అడుగున అన్నీ ఎండుటాకులు మెత్తగా ఉన్నాయి. గెక్‌చుక్ కప్పుకున్న దుప్పటి లాక్కుని, మోచేతులు గుండెల్లో గుచ్చి, మోకాళ్లు



అకస్మాత్తుగా గుఱ్ఱాలు మంచుతో కప్పబడ్డ ఒక చిన్న గుడిసె దగ్గిర, వాటంతటవే ఆగిపోయాయి. "ఇదే మనమీ రాత్రి గడపవలసిన చోటు" అన్నాడతను కిందికి దుముకుతూ. ఆ గుడిసె చాలా చిన్నది. అంతా ఖాళీగానే ఉంది. ఒక పాత్ర అడుగున నిప్పు అంట

ముడుచుకుని పడుకున్నాడు. చుక్ గోడని కావిలించుకున్నాడు, వాళ్ళమ్మ మధ్యగా పడుకుంది. బండీఅతను కొవ్వొత్తి ఊదేసి మంటపక్కన పడుకున్నాడు. అందరికీ వెంటనే నిద్రపట్టింది.

మామూలుగానే, రాత్రి దాహమేసి లేచాడు గెక్. నిద్రబద్ధకం

తోనే బల్లదగ్గిరికి పాక్కుంటూ పోయి, సీసాలో నీళ్ళు కాసిని తాగి, కిటికీపక్కన స్టూలుమీద కూచున్నాడు.

చంద్రుడు మబ్బుచాటునుంచి వెలుగుతున్నాడు. మంచుతో నిండిన కొండలు కిటికీలోంచి నీలంగా, నల్లగా కనిపిస్తున్నాయ్. నాన్న ఈ భూమికొసాకి వెళ్ళిపోయినట్టున్నాడే? అంతకంటె దూరమైన చోటు ఈ ప్రపంచంలో ఎక్కడా లేదనే అనుకుంటున్నాడతను.

తలెత్తి చూశాడు. కిటికీఅవతల ఎవరో తలుపు కొట్తున్నట్టుంది. కాదు, ఎవరివో బరువైన పాదాల క్రింద, మంచు బిగుసుకుపోతోంది. చీకటిలో ఏదో నిశ్వాసం విడిచింది కదిలింది-మిలమిల కళ్లు కదిలించింది. తప్పకుండా ఎలుగుబంటయుంటుం దనుకున్నాడు గెక్.

"దుష్టమృగమా! ఏం కావాలి నీకు? మేము నాన్నదగ్గిరి కెళ్ళడానికి ఇంత అవస్థపడుతుంటే నువ్వు మమ్మల్ని మింగేసి ఎప్పటికీ అక్కడికి కెళ్ళకుండా చేద్దామనుకుంటున్నావా? వెళ్ళిపో! ఎవరైనా పొడిచెయ్యకమునుపే - ఎవరైనా పేల్చెయ్యకమునుపే!" ఆ సన్న కిటికీ చువ్వలకి మొహం బిగించి భయంతో, కుతూహలంతో తన లోనే అనుకున్నాడు.

పారిపోతున్న మేఘాల వెనకనించి అప్పుడే చంద్రుడు ముందుకు వచ్చాడు. ఇందాకటి నలుపు ఇప్పుడు కొంత విరిగింది. అది నిజంగా ఎలుగుబంటి కాదని తెలిసింది. కట్లూ డదీసుకుని గడ్డి మేస్తున్న గుఱ్ఱమది. గెక్ నిరుత్సాహపడ్డాడు.

గుఱ్ఱబ్బాచ్చుకోటుతో వెనక్కి జారాడు. ఏవో చెడ్డ ఆలోచనలు మనస్సులో ఉండడంచేత, చెడ్డకలే వచ్చింది ఆరాత్రి అతనికి. వాళ్ళిద్దరూ కుమ్ములాడుకోవడంలో వాళ్ళమ్మకి మెళుకువ వచ్చింది. చుక్ వేపు తిరిగేటప్పటికి ఏదో గట్టిగా పదునుగా గుచ్చుకుంది ఆమె పక్కలో. ఎప్పుడూ జాగర్తగా ఉండే చుక్ బోనుకున్న స్ప్రింగ్ తీసుకొచ్చి ఎవరికీ తెలియకుండా తలకింద పెట్టుకున్నాడు. ఆమె పారేసిం దది.

వెన్నెలలో బాగా కనిపిస్తున్న గెక్ మొహం వేపు చూసి, ఏదో పీడకల కంటున్నా డనుకుంది. అయితే స్ప్రింగు తీగ తీసి అవతల పారేసినట్టు కాదుగా కల? అగడ్ని తనవేపుకు తిప్పుకుని మెల్లిగా జోకొట్టూ కణతలమీద చేత్తో రాసింది.

చుక్ పెదిమలు కదిల్చినవ్వాడు. వాళ్ళమ్మ లేచి మేజోళ్ళతోనే కిటికీదగ్గరికి నడిచివెళ్ళింది.

ఇంకా తెల్లవారలేదు. ఆకాశంలో నక్షత్రాలింకా మెరుస్తూనే ఉన్నాయి. సరిగ్గా నెత్తిమీదే కొన్ని వేళ్ళాడుతుంటే, కొన్ని ఎక్కడినించో మిణుకు మిణుకుమంటున్నాయి.

తమాషా ఏమిటంటే-ఇందాకా గెక్ కూచున్న చోటులోనే కూచుని, అతను ఆలోచించినట్టే ఆమె, తన భర్త ఉంటున్న ఆచోటుకంటె దూరమైన ప్రదేశాలు ప్రపంచంలో నిజంగా చాలా కొద్దే ఉంటాయి, అనుకుంది.

ఆ మరునాడు వాళ్ళ దారంతా అడవుల్లోంచి, పెద్దపెద్దకొండల్లోంచి మెలికెలు తిరుగుంది. ఎత్తు కెక్కుల్సొచ్చినప్పుడు బండివాడు దిగి మంచులో బండిపక్కనే నడిచేవాడు. ఒక్కొక్కప్పుడు బాగా ఎత్తునించి క్రిందికి దిగేటప్పుడు బండీ ఎంత విసురుగా దొర్లుకుపోయేదంటే, చుక్కూ గెక్కూ తాము, బండీ, గుఱ్ఱాలు అన్నీ ఆకాశంలోంచి ఊడిపడుతున్నామా అనుకునేవారు.

సాయంత్రం షడేన మయానికి అన్నాడు బండివాడు. "ఇంక వచ్చేశాం! అక్కడ ఒక మలుపు తిరిగామంటే కాంప్ కనిపిస్తూఉంటుంది."

"చూడు! చూడు!" అంటూ పట్టలేని సంతోషంతో చుక్కూ గెక్కూ ముందుకు వొరిగారు. బండి కుదుపుకి మళ్ళీ వెనక్కి పడ్డారు గడ్డిలో.

వాళ్ళమ్మ కొద్దిగా నవ్వి కప్పుకున్న దుప్పటి తీసిపారేసింది.

ఆ వంపు వచ్చింది. బండి జాగ్రత్తగా నడుస్తూ అక్క డొక బయలులో ఉన్న మూడే ఇళ్ళదగ్గరాగింది. పెద్ద పెద్ద గాలులు విసరకుండా సురక్షితమైఉండా ప్రదేశం.

అరె! ఒక కుక్కకూడా మొరగడం లేదే? అన లక్కడెవ్వరూ

(38-వ పేజీ చూడుడు)

# అదృష్టశాలి

"తపతి"

[ఆగ్లమునుండి]



అనగా అనగా ఒక దేశాన్ని ఒక రాజు పాలిస్తుండేవాడు. ఆరాజ్యంలోనే ఒక బీదవాడుండే వాడు. వానికి లేకలేక ఒక కుమారుడు కలిగాడు. ఆకుర్రవాడు పుట్టగానే ఆతడు తప్పక రాజుగారి కుమార్తెను వివాహమాడతాడని జ్యోతిష్కులు చెప్పారు. ఈ సంగతి రాజుగారికి తెలిసింది. ఛీ! నా కూతురు ఒక ముష్టివానికి భార్య కావడమా" అనుకున్నాడు. ఒక బాటసారి వేషంలో ఆ బీదవాడింటికి వెళ్లి "నీకొడుకును నా కిచ్చేస్తే లక్ష వరహాలిస్తా" నన్నాడు రాజు. బీదవాడు మొదట్లో సంశయించాడు కాని తరువాత డబ్బు కాశపడి తన కొడుకును వాని కొప్పగించాడు. రాజు ఆ పిల్లవానిని ఒక పెట్టెలో పెట్టి మూత వేసి నదిలో విడిచి పెట్టాడు.

దైవనిర్ణయం ఎవరు తప్పించ గలరు! ఆ పెట్టె మునిగిపోకుండా అలా తేలుతూ పోయి ఒక పల్లెవానికి దొరికింది. పల్లెవానికి సంతానం లేదు. అందుచేత ఈ బిడ్డను దేముడే ప్రసాదించాడని తలిచీ వానిని ఇంటికి తీసుకొనిపోయి ఎంతో గారాబంగా పెంచుకున్నాడు.

అలా పదహారు సంవత్సరాలు గడిచిచాయి ఆ కుర్రవానికి రాజకుమారునికివలె పల్లెవాడు సకల విద్యలు నేర్పించాడు.

రాజుగారికి అప్పటికి జరిగిన సంగతి తెలిసింది "అరే! నే నొకలా తలుస్తేఇంకొకలా జరిగిందే" అనుకొని, ఆ పల్లెవానిఇంటికి వెళ్లాడు.

"ఈ కుర్రవాడు చాలా అందంగా వున్నాడు. చాలా తెలివి గలవాడు కూడా. నే నొక ఉత్తరం యిచ్చివీనిని రాణీవద్దకు పంపుతాను. ఆమె ఆదరించి ఇతనిని బహూకరించి పంపుతుంది" అన్నాడు రాజు. "అంతకంటే నాబాబూ" అన్నాడు పల్లెవాడు. అప్పుడు రాజు "ఈ వుత్తరం తెచ్చిన వానిని నేను వచ్చేలోగా ఎలాగైనా చంపించి పాతిపెట్టించ వలసింది." అని ఒక ఉత్తరం వ్రాసి ఆ పిల్లవాని కిచ్చాడు. అతడా జాబును తీసుకుని రాజనగరుకు ప్రయాణ మయ్యాడు. ఒక అడవిని చేరుకునేసరికి చీకటిపడింది. సమీపంలో ఒక చిన్న గుడిసె కనిపించింది. గుడిసెలో చిన్న దీపం మినుకు మినుకు మంటూంది. అతడా గుడిసెలో ప్రవేశించాడు. అక్కడ ఒక ముసలమ్మ



తప్పు మెవ్వరూ కనిపించలేదు. "ఇక్కడికెందుకొచ్చావ్ నాయనా ఇది దొంగల ఇల్లు. నిన్ను చూస్తే బ్రతుకనిస్తారా?" అంది. "ఏం చేసినా సరే! నే నింకొక్క అడుగు వెయ్యలేను. ఈ వేళ కిక్కడే విశ్రమించి రేపు ఎలాగో దారి వెతుక్కుని వెళ్ళిపోతాను." అని చెప్పి ఆ గుడిసెలోనే ఒక బల్లమీద పడుకున్నాడు. కొంతసేపటికి దొంగలు వచ్చి "ఈతడెవరు? అని అడిగారు" "ఏమో! ఎంతో అలసివచ్చినట్లున్నాడు. హాయిగా నిద్రపోతున్నాడు." అంది ముసలమ్మ. దొంగల్లో ఒకడు అతని జేబు వెతికి చూచి ఆజాబు తీశాడు అందరూ ఏమిటో అని చదివారు. "పాపం! అనవసరంగా ఎందుకు వీణ్ణి చంపుతాడు ఈ రాజు? ఈ రాజు మనల్ని బ్రతకనివ్వడం లేదు. ఉండు! వీడి పని పడదాం" అనుకున్నారు దొంగలు. "వీనికి నా కుమార్తె నిచ్చి వివాహము చేయవలెను. నేను వచ్చేలోపల ఈ కార్యము పూర్తిచేయవలెను" అని ఇంకొక వుత్తరం వ్రాసి అతని జేబులో ఉంచి వారు వెళ్ళిపోయారు.

తెల్లవారగానే ఆ పిల్లవాడు లేచి బయలుదేరి వెళ్లాడు. ఎలాగో దారి తెల్సుకొని రాజనగరు చేరుకున్నాడు. రాణికి జాబు ఇచ్చాడు. రాణి అది చదువుకొని దాని ప్రకారం రాకుమార్తెను వాని కిచ్చి వైభవంగా వివాహం చేసింది. రాజుగారు తిరిగి రాజగృహం ప్రవేశించేసరికి, ఎదురుగా రాణీ, కుమార్తె, అల్లుడూ స్వాగతమిచ్చారు. రాజు ఇదంతా చూసి నిర్ఘాంతపోయాడు. "ఏమిటి? నేను నీ కిచ్చిన జాబు తిన్నగా రాణీ కిచ్చావా, దారిలో ఎక్కడైనా ఆగావా?" అని అతని నడిగాడు రాజు. "తిన్నగా రాణీచేతికే యిచ్చాను ప్రభూ! కాని దారిలో ఒక అడవిలో ఒక ముసలమ్మ గుడిసెలో పడుకున్నమాట నిజమే. అంతే!" అని సమాధానమిచ్చాడు.

"అయితే! ఇదిగో. నే నొక పని చెప్తాను! అది చేయగలుగుతేనే నా కుమార్తెకు భర్తవు కాగలవు. లేకపోతే నిన్ను చంపేస్తాను" అన్నాడు రాజు. "సరే! సెలవివ్వండి" అన్నాడు పిల్లవాడు. "ఈ ఊరికి కొన్ని వేల మైళ్ళ దూరంలో ఒక బంగారు కొండ వుంది. ఆ కొండమీద ఒక రాక్షసుడు వున్నాడు. ఆ రాక్షసుని తలంతా బంగారుజుట్టే. ఆ రాక్షసుని తలలోని బంగారు జడలు తేవాలి!" అన్నాడు రాజు. సరేనని ఆ పిల్లవాడు బయల్దేరాడు.

అలా కొన్ని మైళ్ళ దూరం పోయేసరికి ఒక వూరు తగిలింది. ఆ వూళ్లో నీటిబుగ్గలోనుంచి కొన్నాళ్ళుగా నీరురావడంలేదు. దానికి కారణం ఎవ్వరికీ తెలియదు. ఆ పిల్లవాడు ఆలోచించాడు. కాని ఏమీ తెలియలేదు; "సరే! ఆలోచిద్దాం" అనుకుంటూ మళ్ళీ బయలుదేరి ఇంకొకవూరు చేరుకున్నాడు. ఆ వూళ్లో ఒక ఫలవృక్షం వుంది. అది బంగారుపళ్ళు కాస్తుంది. కాని కొన్నాళ్లుగా ఆ చెట్టుకి పూత లేదు. కారణం తెలియదు. మళ్ళీ బయల్దేరాడు. ఒక చిన్న కాలువదగ్గరకు వచ్చాడు. అక్కడొక పల్లెవాడు ఒక చిన్న నావను సిద్ధంగా వుంచాడు. "బాబూ! రండి! నావ మీద ఏరుదాటిస్తాను" అన్నాడు. సరేనని నావమీద ఎక్కాడు.

"బాబూ! ఒక్కటడుగుతాను చెప్పండి. నేను ఎన్ని వందల ఏళ్ళనుండో ఇలా మీబోటివాండ్లను ఈ నావమీద దాటిస్తూవున్నాను. నాకు ఈ వృత్తినుండి విముక్తి ఎలా కలుగుతుంది బాబూ!" అని అడిగాడు నావికుడు. "మళ్ళీ వచ్చేటప్పుడు చెప్తాను" అన్నాడు పిల్లవాడు. నావ అవతలి ఒడ్డుకు చేరింది. అతడు నావదిగి బంగారపు కొండ ఎక్కాడు. ఆ కొండ మీద చక్కని భవనం వుంది. బెదురు లేకుండా అతడు భవనం ప్రవేశించాడు. ఒక ముసలిరాక్షసి అతని కెదురైంది. అతడు భయంతో అలాగే నిలబడిపోయాడు. ఆ ముసలి రాక్షసి దగ్గరకు వచ్చి "నిన్నేమీ చెయ్యను! ఎందుకలా భయపడతావు? రాక్షసుడు వచ్చే వేళ అయింది. ఇక్కడికెందుకొచ్చావ్? నిన్ను చూస్తే చంపకుండా వదులుతాడా?" అంది. అతడు భయం వదలి తాను ఎందుకు వచ్చాడో చెప్పాడు. తాను చూచిన మూడు వింతలూకూడా చెప్పాడు. "అవ్వా! ఎలాగైనా నాకు బంగారు జడలు సంపాదించి పెట్టాలి. ఆ సమస్యలుకూడా కనుక్కోవాలి" అన్నాడు. "సరే అంతా నేను చేస్తాను. నీవు చూస్తూవుండు." అని అతణ్ణి నొక బల్లిగా చేసి గోడమీద పెట్టింది. ఇంతలో రాక్షసుడు వచ్చి నరవాసన, నరవాసన" అంటూ భవనం ప్రవేశించాడు. "నీ పిచ్చిగాని; నిన్న నీవు చంపి తెచ్చిన మనుషులే ఆ గదిలో వాసన వేస్తున్నారు. ఎంత అలసి వచ్చావో! హాయిగా నిద్రపో" అంది ముసలి

రాక్షసి. ఆ రాక్షసు డీమాటలు నమ్మి హాయిగా నిద్ర పోయాడు. రాక్షసునికి బాగా నిద్రపట్టగానే ముసలి రాక్షసి వాని తలనుండి ఒక జడ కత్తిరించింది. రాక్షసుడు ఉలిక్కిపడి లేచాడు. "ఏమిటిది? వేళాకోళమనుకున్నావా?" అని గుడ్లురిమాడు. "ఏమీ లేదు నాకు ఒక కల వచ్చింది. ఆకలలో నీజుట్టు పీకానుకాబోలు. ఒక వూళ్ళో ఒక నీటిబుగ్గ వుందట. దానిలో కొన్నాళ్ళుగా నీరు రావటంలేదట. నిజమేనా?" అంది ముసలి రాక్షసి.

"అవును. ఎలా వొస్తుంది, ఆ నీటిబుగ్గ అడుగున ఒక పెద్దకప్ప అడ్డంగా పడివుంది. దాన్ని తీసేస్తే నీరు మామూలుగా ప్రవహిస్తుంది" అని చెప్పి మళ్ళీ నిద్రపోయాడు. కొంత సేపయినతరువాత ముసలి రాక్షసి ఇంకొక జడ కత్తిరించి లాగింది. రాక్షసుడు చివాలున లేచి "ఏమిటది? ఒకమారు చెప్పానా? ఎందుకు నా జుట్టు పీకుతావ్?" అన్నాడు కోపంగా. "ఏమి చేయమంటావ్? నాకు చిన్న మగత నిద్ర పట్టింది. అందులో ఒక కల వచ్చింది. ఒకవూళ్లో ఒక చెట్టు బంగారుపళ్లు కాస్తుందట. కాని కొన్నాళ్ళనుండీ ఎందుకో పూతే పూయటం లేదట. ఎందుకు కాయటం లేదో?" అంది. "ఎందుకు కాస్తుంది? ఆ చెట్టుదున ఒక ఎలుక దొలిచివేస్తున్నది! అందుకే పూత పూయటంలేదు. ఈమారు నా జుట్టు పీకావా? చంపేస్తాను" అని తిరిగి నిద్రపోయాడు. తిరిగి ముసలిరాక్షసి రాక్షసుని తలలో మరిఒక జడ కత్తిరించింది. రాక్షసుడు పెద్దగా అరుస్తూ "చంపేస్తాను ముసలిముండా! నాతోనా, వేళాకోళం?" అంటూ ముసలి రాక్షసి జుట్టు పట్టుకున్నాడు.

"ఉండు. ఉండు. నన్ను చంపబోకు ఇంకెప్పుడూ ఇలాంటి పని చెయ్యను. ఒక నదిలో ఒక పడవ వాడు ఎప్పుడూ ఎవర్నో ఒకర్ని నది దాటిస్తూనేవుంటున్నట్లు కల వచ్చింది. వాడి కెప్పుడు విముక్తి? అని ఆలోచిస్తూ పరాకుగా నీజుట్టు పీకానుకాబోలు" అంది. రాక్షసుడు శాంతించి "ఎవడిచేతిలోనైనా నావతెడ్డుపెట్టేసి పారిపోతే ఆ పడవకళాసు ఏముక్తుడౌతాడు. ఇక నాజుట్టు పీకబోకు. జాగ్రత్త" అని చెప్పి పడుకున్నాడా రాక్షసుడు. తెల్లవారిన తరువాత లేచి తనపనిమీద వెళ్ళిపోయాడు. ముసలి రాక్షసి పిల్లవానిని, మామూలు రూపంలోకి మార్చి మూడు బంగారుజటలూ యిచ్చి పంపేసింది.

అతడుతిరిగి ప్రయాణమై పడవకళాసువద్దకు వచ్చాడు. "బాబు! నాకెప్పుడు ముక్తి కలుగుతుందో తెలుసుకున్నారా?" అని అడిగాడు. "ముందు నన్ను నది దాటించు. తరువాత చెప్తాను" అన్నాడు. పడవవాడు సంతోషంతో అతనిని ఆవలిఒడ్డు చేర్చాడు. పడవ దిగి "ఈ మారు ఎవరైనా పడవ ఎక్కడానికి వస్తే, వాడి చేతిలో ఆ తెడ్డు పెట్టేసి నీవు పారిపో! అంతే నీకు విముక్తి కలుగుతుంది." అనిచెప్పి వెళ్ళిపోయాడు. వెళ్ళిబంగారు చెట్టున్న వూరు చేరుకున్నాడు. "ఆ చెట్టు మొదట్లో ఉన్న ఎలుకను చంపెయ్యండి. చెట్టు ఎప్పటి మాదిరిగా పూత పూస్తుంది" అని ఆ గ్రామస్థులకు చెప్పాడు. అందరూ కలిసి చెట్టుమొదట త్రవ్వి ఎలుకను చంపేశారు చూస్తుండగానే చెట్టు చిగిర్చి పూత ప్రారంభించింది. ఆ వూరి వాళ్ళు సంతోషించి అతనికి మోయ గలిగినన్ని మొహారీలు బహూకరించి పంపారు. అతడు మొదటి వూరుచేరి "ఆ నీటి బుగ్గ అడుగున కప్పను తీసేయండి. ఎప్పటిలాగా నీరు ప్రవహిస్తుంది." అని చెప్పాడు. ఆ గ్రామస్థులు అందరూ కలిసి కప్పను తీసివేయగానే ఎప్పటిలా నీరు వూరింది. ఆ వూరివాళ్ళు సంతోషించి, అతనికి మరింత ధన మిచ్చి పంపారు.

అతడు చివరకు రాజుగారివద్దకు చేరి మూడు బంగారు జటలూ ఇచ్చాడు. తాను సంపాదించిన ధనంకూడా చూపించాడు. "ఇంత ధనం. ఎలా సంపాదించావ్." అని అడిగాడు రాజు. పడవవాడుండే చోటు ఆనవాలు చెప్పి, "ఆ నది దాటితే ఆవలివడ్డున బోలెడన్ని మొహారీలున్నాయి" అన్నాడు. తక్షణం రాజుగారు ప్రయాణమై పడవ ఎక్కాడు. పడవవాడు రాజుగారి చేతిలో తెడ్డు పెట్టేసి ఒడ్డుగత్తిపారిపోయాడు. అప్పటినుండీ రాజుగారు పడవకళాసై వచ్చే పోయేవాళ్ళని నది దాటిస్తూ అలాగే వుండిపోయాడు. రాజ్యానికి పిల్లవాడు మహారాజయ్యాడు.

---

పాపమంటే నాకూ గిట్టదు. కాని నాతగూ ఎక్కడంటే కాని వాళ్లే దాని వల్ల లబ్ధి పొందుతున్నారు!

—హార్పో మార్క్స

# ఉత్కృష్టమైన వస్తువులు

ఢిల్లీచక్రవర్తి అక్బరు దర్బారులో బీర్బల్ అను తెలివిగలవాడు ఉండేవాడు. అతనిమీద చక్రవర్తికి అభిమానం. ఒక రోజు అక్బరు బీర్బల్‌ను వెంటబెట్టుకొని తన ఉద్యానవనంలో విహరిస్తున్నాడు. సాయంకాలపు ప్రకృతి సుందరంగా వున్నది. మందమారుతం వీస్తున్నది. ఇద్దరూ పచారు చేస్తూ సరస్సు ఒడ్డును చేరి ఒక చెట్టుక్రింద కూర్చుని ఇష్టాగోష్ఠి చేయసాగారు.

అక్బరు "బీర్బల్, నే నడిగిన ప్రశ్నలకు సమాధానము చెప్పగలవా?" అని అడిగాడు. బీర్బల్ తల ఊపి, "అడగండి" అన్నాడు. అక్బరు "అన్నిటిలోకి శ్రేష్ఠమైన పాలు ఏవి" అని అడిగాడు. బీర్బల్ "తల్లిపాలు" అని సమాధానమిచ్చాడు. చక్రవర్తి ఎలాగని ప్రశ్నించాడు. బీర్బల్ "ఎందుచేతనంటే బిడ్డడు తల్లిపాలను త్రాగి పెంగి, పెద్దవాడై ప్రపంచంలో గొప్ప గొప్ప కార్యాలు చేస్తాడు" అని చెప్పాడు.

ఈ సమాధానానికి అక్బరు సంతోషించి "సరే! శ్రేష్ఠమైన పువ్వు ఏది?" అని ప్రశ్నించాడు. "ప్రత్తిపువ్వు" అని సమాధానమిచ్చాడుబీర్బల్. చక్రవర్తికి ఆశ్చర్యం వేసింది. "అవును ప్రభూ! ప్రత్తిపువ్వే అన్నిటిలోకి శ్రేష్ఠమైనది. అది మనకందరకు కట్టుకోడానికి వస్త్రాల నిస్తున్నది" అని చెప్పాడు.

అక్బరు కొంచ మాలోచించి "శ్రేష్ఠమైన ఫల మేది?" అని తిరిగి ప్రశ్నించాడు. మంచి "పిల్లవాడు" అని తడుముకోకుండా సమాధానమిచ్చాడు. "ఎందుచేతనంటే వాడు [illegible] తల్లిదండ్రుల గౌరవప్రతిష్ఠలను నిలిపి గొప్పవా డవుతాడు."

తిరిగి అక్బరు "సరే! దీనికి జవాబివ్వు. గొప్పరాజు ఎవరు" అని ప్రశ్నించాడు మనస్సులో బీర్బల్ "అక్బరు ప్రభూ" అని సమాధానమిస్తాడనుకున్నాడు. కాని బీర్బల్ "సూర్యుడు" అని జవాబిచ్చాడు. "ఆయన సముద్రము, నది, సరస్సులలోని నీటిని వర్షరూపంగా ప్రపంచానికి పంచిపెడుతున్నాడు. ధనవంతులు,* దరిద్రులు, సుజనులు, దుర్జనులు అనేభేదభావం లేక అందరినీ సమానంగా సుఖింపజేస్తున్నాడు." అక్బరు చివరి ప్రశ్న అడిగాడు "ప్రపంచములోకెల్ల గొప్ప శక్తిగల వస్తువేది" బీర్బల్ "మంచిమాట" అన్నాడు, "మంచి మాటలకు మానవులందరూ వశమవుతారు. ఏపని కత్తికీ, తుపాకికీ, సాధ్యము కాదో, ఆ పని మంచి మాటలతో సానుకూల మవుతుంది."

అక్బరు బీర్బల్ చెప్పిన సమాధానాలకి తృప్తి చెంది అతనిని బహూకరించాడు.



బాలగేయం:

# తమాషా

శ్రీ కోట రాధాకృష్ణమూర్తి

అప్పా లమ్మ అప్పయ్యింట్లో
గొప్ప తమాషా జరిగింది.
అమావాస్యచీకట్లో యింట్లో
ఢమ ఢమ డబ్బా దొర్లింది.

దొంగలు పడ్డారండో! అని
ఆడంగులు కేకలు పెట్టారు.
అప్పయ్యేమో ఎప్పటిలాగే
దుప్పటి ముసుగున దూరాడు!

ఇరుగు పొరుగువా రీ కేకలు విని
పరుగున ఇవతలి కొచ్చారు
సంగ తేమి టని ప్రశ్నించంగా
దొంగలు పడ్డా రన్నారు.

'దొంగలు పట్టెయ్యా"లని కొందఱు
ధీరులు పరుగులు తీశారు.
తలుపు తెరచి చూద్దామని కొందఱు
తలుపులు మెల్లిగ తెరిచారు

నల్లటి మచ్చల పిల్లులు రెండే
మెల్లిగ ఇవతలి కొచ్చాయి!
పిల్లులు కనబడగానే అంతా
తెల్లబోయి నిలుచున్నారు.



# భాషల పుట్టుపూర్వోత్తరాలు

## 5. భాష, సాహిత్యకళ

మాట లేని దశలో మనుషులు పచ్చి మాంసం తింటూవుండేవారు. మాటాడే ప్రథమదశలో మాంసం వొండుకు తినే రుచికి అలవాటుపడ్డారు. తర్వాత బొమ్మలభాషలూ, లిపీ, వాక్సాహిత్యమూ పుట్టాయి. ప్రపంచంమొత్తంమీద మన కీనాడు ఆర్యుల వాక్సాహిత్య మొక్కటే మిగిలింది—అక్కడక్కడ ప్రాంతీయ వాక్సాహిత్యా లున్నాయనుకోండి. లిపి దేశకాలపరిస్థితులతో పరిణతి పొందింది. అచ్చుయంత్రం భాషల పెరుగుదలలో గొప్ప విప్లవం తీసుకొచ్చింది. ఇవీ మనకి యింతవరకూ తెలిసిన విశేషాలు.

'సాహిత్యం—కళ': సాహిత్యం అనగా ఏమిటి? గౌరవస్థానం పొందిన రచన సాహిత్యం అవుతుంది. ఒక కుక్క ఒక అబ్బాయిమీద పడి కరవబోగా, అతను తల్లిదగ్గిరకి పారిపోయా డనుకుందాం—అది కథ అవుతుందా? అవదు. కాని, ఆ అబ్బాయి వాళ్ళమ్మతో, "అమ్మా, అమ్మా- వాళ్ళ కుక్కొం నామీద భొంయ్ మని అరుస్తూ పడిందే. ఎప్పటికిమల్లే దాన్ని గొలుసుతో కట్టేశా రనుకున్నాను. కాని, బిస్కట్లు పెట్టేందుకు వొదిలా రట అది నా కాలు పట్టుకుంటుం దని భయపడి, పెద్దపెట్టున కేకేసి, వీథిలోకి పరిగెత్తాను. ఇంతలో వాళ్ళబ్బాయి వచ్చి ఆ కుక్కని కట్టేశాడు." అంటూ చిలవలూ పలవలతో తల్లికి చెబితే, "అయ్యో! ఎంత పని జరిగింది, నాయనా" అంటుందామె. ఈ వర్ణనవల్ల ఆ సంఘటనకి జీవం కలుగుతోంది. కుర్రాడు ఏం చేస్తున్నాడంటే, తన అనుభవాన్ని తల్లికి వ్యక్తపరుస్తున్నాడు. ఆ 'వ్యక్తపరచడమే' కథ అవుతుంది. అదేమాదిరిగా ప్రతిరచనా సాహిత్యం కానేరదు. సామాన్యవిషయానికి జీవం పోస్తే కథ అయినట్టు, ఉదాత్తతవల్ల రచన సాహిత్యపీఠం అలంకరిస్తుంది.

సైనికుల్ని ఉత్తేజపరుస్తుంది మార్చింగ్ సాంగ్. పాపని నిద్రబుచ్చుతుంది లాలిపాట. దేశభక్తిని ప్రకోపింపజేసి, కార్యోత్సాహుల్ని చేస్తాయి జాతీయగీతాలు. దేవునిమీద గురి ఏర్పడుతుంది కీర్తనలవల్ల. నవలల్లో నాయకీనాయకుల ప్రణయంవల్ల రసోద్దీపన కలుగుతుంది మనలో. ఇదంతా సాహిత్యమే. అది మనకి వేరువేరు రూపాలలో కనిపిస్తుంది.

సాహిత్యం ఒక కళ. చిత్రలేఖనం ఒక కళ. సంగీతం ఒక కళ. కళ అనగా ఏమిటి? సౌందర్యాన్ని ఆశ్రయిస్తూ, ప్రజాహృదయంలో సంచలనం తీసుకొచ్చే దే కళ. 'సత్యమ్—శివమ్—సుందరమ్' అనే ఆర్యోక్తి మీరు వినివుంటారు. God, Truth and Beauty అన్నారు పాశ్చాత్యులు. సత్యమనేది మార్గం. సౌందర్యమనేది 'మంచి' అనుభూతి. 'మంచి' అని ఎందు కన్నానంటే, అందం అన్నిచోట్లా మంచిగా ఉండదు.

రామాయణంలోయిద్దరుముఖ్యులున్నారు; రాముడు, రావణుడు. రాము డెంత సజ్జనుడో, రావణు డంత క్రూరకర్ముడు. కాని వాల్మీకి రావణుడి తపస్సూ, అతని శివభక్తీ మహాఅందంగా వర్ణిస్తాడు. అతవి భుజబలానికీ నిష్ఠకీ మనం ఆశ్చర్యపోతాం. ఇంతటి వాణ్ణి శ్రీరామచంద్రుడు జయించాడని నాయకుని ఘనత నిరూపిస్తాడు కవి. రాముడిలోని అందం వేరు—రావణుడిలోని అందం వేరు. తాచుపాము అందంగా ఉంటుంది; లేడిపిల్లా అందంగానే ఉంటుంది. పులి అందం వేరు; ఆవుఅందం వేరు. తాచుపామునీ పెద్దపులినీ మనం దగ్గిరికి రానివ్వం. అవి రెండూ మనకి హాని చేస్తాయికనక. లేడిపిల్లతో ఆడుకుంటాం; ఆవుమెడ గోకుతాం. అంచేత, 'మంచి' అందం, మానవసముదాయానికి కీడు కలిగించని అందం. సాహిత్యమనిపించుకునే రచనలో ఈ సౌందర్యం విధాయకంగా ఉంటుంది.

సాహిత్యనిర్మాతకి న్యాయదృష్టితో జగత్తుని పరిశీలించగలిగే సత్తువ కావాలి. వ్యక్తినిబట్టే రచనాసమర్థత. వ్యాసఋషి రాసింది కాబట్టే భారతం కలకాలం నిలిచివుంటుంది.

కళ మానవుణ్ణి పశువునించి మనిషిగా చేసి, ఆ మనిషిలో భగవదంశ కల్పించింది. మానవుల పురోవృద్ధికి కళ ఒక సాధనం. ఉత్తమజీవనానికి ప్రాణం పొయ్యడమే కళలోని పరమార్థం. ప్రయోజనం లేని పదార్థాన్ని మానవుడు మొదట్నుంచీ వొదిలేస్తూనే వచ్చాడు; కాని, సంధ్యారుణచిత్రంలోని సొగసునీ, నక్షత్రమండలపు టగాధాన్నీ, విశాలప్రకృతిలోని రామణీయకతనీ చూసి విస్మయపడి, మానవుడు కళని ఆరాధిస్తూవచ్చాడు. మన పూర్వీకుల ఆధ్యాత్మికజీవనం కళాస్వాదనంతో ప్రారంభ మయింది.

నేటి మానవుడికి కళ ఒక పక్కా సైన్సు ఒక పక్కా—ఊపిరితిత్తులూ గుండెకాయలా—ఒకదానిమీద ఒకటి ఆధారపడివున్నాయి. ఒకటి విజ్ఞానాన్నీ మరొకటి అనుభూతినీ ప్రసాదిస్తున్నాయి. ఇక్కడ అనుభూతి అంటే ఫీలింగ్—హృదయస్పందన. ఉత్తమ సాహిత్య మెప్పుడూ మన హృదయాన్ని కదిలించి సానుభూతి సంపాదిస్తుంది. ఆ 'సానుభూతి' దుష్టశిక్షణా, శిష్టరక్షణా ప్రమాణంగా కలిగివుండా లన్నారు నీతికోవిదులు.

పారిశ్రామికవిప్లవానంతరం కళలన్నీ ప్రజాస్వామ్యానివనేసిద్ధాంతం వ్యాప్తిలోకి రావడంవల్ల సాహిత్యం ప్రజాస్వామ్య కళగా (Democratic Artగా) మారింది. ప్రజాస్వామ్యయుగలోపాలు సాహిత్యకళలో కూడా ప్రవేశించాయి.

ఆ లోపాలు ఎలాటి వంటారా? ఉండేందుకు యిల్లూ, కడుపునిండా భోజనం ప్రతిమనిషీ సుచిగా బతికేందుకు తప్పనిసరిగా కావాలి. కాని అద్దెకు యిచ్చేందుకు ఎక్కువ యిళ్లూ, గాదెలు నింపేందుకు ధాన్యంబస్తాలూ కావాలని దురాశాపరులు కోరుకోవడంవల్ల, ఆ వస్తువులు వాటి సహజప్రయోజనాలు పోగొట్టుకుని, కోట్లకొద్దీ మనుషుల్ని కొందరి మూర్ఖులకి బానిసలుగా చేస్తున్నాయి. కళ సంఘజీవితానికి ప్రతిబింపం అవడంవల్ల, ఈ లోపాలే

(౩౯-వ పేజీ చూడుడు)

# యోగీశ్వరుడు, కరుణానిధి



[శ్రీ కంభంపాటి సత్యనారాయణ శ్రేష్ఠి]

బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారితో నాకు ఇంచుమించు ఇరవై సంవత్సరాలుగా పరిచయం. వారి యోగంతో దాదాపు 15 సంవత్సరాలుగా శిష్యరీత్యా సంబంధం వుంది

నా చిన్ననాడు నేను ఏవేవో రోగాల వల్ల బాధలు పడుచుండేవాడిని నా తండ్రి గారు స్వయంగా ఆయుర్వేద చికిత్స చేశారు చేయించారు. కాని, వాటివల్ల అనుకూలించక ఇంగ్లీషు వైద్యంకూడా చేయించుకున్నాను అప్పటికికూడా నా అనారోగ్యం తొలగలేదు ఏ మహానుభావుడో, ఏ ఋషిపుంగవుడో సంప్రాప్తించినగాని నా అకాలమరణం తప్పదని భావిస్తుండేవాడిని

ఈ నా సంకల్పం ఫలించింది కాబోలు! శ్రీ పభాకరశాస్త్రిగారి వద్దకు వెళ్ళితే, వారు యోగంతో జబ్బు కుదురుస్తారని నా మిత్రులొకరన్నారు వెంటనే గంపెడాశతో వారింటికి వెళ్లాను

నాకు 14 వ సంవత్సరంనుంచి యోగాభ్యాసమంటే ఆశ కారణం, మా తండ్రిగారు 50 సంవత్సరాలుగా ప్రాణాయామం చేసేవారు వారు కాలధర్మం చెందేటప్పుడు వారి వయస్సు 90 సంవత్సరాలు. ఆ సంస్కారంతోనే చాలా నాకు యోగంలో ఆసక్తివుండేది కాని నాకది 25 సంవత్సరాలవరకు సాధ్యంకాలేదు

సరే, నేను శాస్త్రిగారింటికి వెళ్ళి నా జబ్బుస్థితి వివరించినాను "నాయనా మీ పెద్దవాళ్లను ఎవరినైనా పిలుచుకుని, మంచి రోజు చూచుకొనిరా" అని శ్రీ శాస్త్రిగారన్నారు మర్నాడు మా తండ్రిగారిని వెంటబెట్టుకొని శాస్త్రిగారింటికి వెళ్లినాను నన్ను వారు తాపీగా కూర్చోమని చెప్పి భగవంతునికి నమస్కారం చెయ్యమన్నారు నా ప్రజ్ఞ ఎక్కడికోపోయింది శరీరమంతా గగుర్పొడిచింది కండ్లు మూతలుపడి వారు తెరవమన్నదాక తెరవలేకపోయాను "నా సంకల్పం నేడు నెరవేరినది. నాకు ఇంతటి నుంచి సద్గురువులు మీరే" అని మనస్సులో అనుకుని ఎంతో ఆనందపడ్డాను అప్పటి నుంచి వారి ఆజ్ఞానుసారం ప్రతిదినం ఉదయం, సాయంకాలం వారి ప్రార్థనల వేళకు హాజరయ్యేవాడిని. వారం లోపుగా నా అనారోగ్యం తొలగి క్రొత్త జన్మవచ్చినట్లు తోచింది.

ఈ విధంగా వారు మద్రాసు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరీ ఉద్యోగంలో వున్నంతవరకు గడిచింది. తర్వాత వారు పెన్షను పుచ్చుకొని తిరుపతి వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయంలో చేరారు. వారు తిరుపతి వెళ్లేటప్పుడు నేను నా అర్ధాంగి గొల్లున ఏడ్చాము. దానికి వారు నవ్వి "నేను తిరుపతికి వెళ్ళినా, మరొకచోటికి వెళ్ళినా ఎప్పుడూ మీ హృదయాలకు సన్నిహితంగానే వుంటాను. భగవంతుడు నన్ను తిరుపతికి వెళ్ళమని ప్రేరేపిస్తున్నాడు, వెళ్ళక తప్పదు", అని సెలవిచ్చారు.

పిదప, తిరుపతినుంచి చెన్నపురికి వచ్చినప్పుడెల్లా వారు మాయింటనే బసచేసేవారు. వారు బసచేసినప్పుడు మాయిల్లు వైకుంఠం వలె కలకలలాడుతుండేది. వారు అసువులు బాసినపిదప అట్టి భాగ్యం నాకు మద్రాసులో వున్న తక్కిన మిత్రులకు శిష్య

(40-వ పేజీ చూడుడు)



శాస్త్రిగారి గురువులు
శ్రీ జంకా సామిరావు గారు



శాస్త్రిగారు, వారి సతీమణి

# జోగ్ జలపాతం

(13-వ పేజీ తరువాయి)

పుట్టినదనియు, అందు బ్రహ్మ వెలసి తన కేమియు పాలుపోక దిక్కులు చూచుచుండగా ఒక నాదము వినవచ్చెననియు, ఆ నాదము ఏ వంకనుండి వచ్చినదో ఆ మార్గమును బట్టి తపస్సు చేయగా నాదమూలమగు శుద్ధ చైతన్యజ్యోతి సాక్షాత్కరించెననియు, అచటనే త్రిగుణములు ప్రకృతివికాసములు, సర్వము కనిపించి రూపొందెననియు, అప్పుడే అతనికి సృష్టివిజ్ఞానము ఉదయించెననియు పురాణములు తెలుపుచున్నవి.

'నీల తోయదమధ్యస్థా ద్విద్యుల్లేఖేవ భాస్వరా నీవారశూకవత్తన్వీ పీతా భాస్వత్యణూపమా" అని మంత్ర వాక్యము. ఉదకములయందు దేవుడు, దేవునియందుదకములు పరస్పరాశ్రయములు. జలము, అగ్ని అన్యోన్యాశ్రయములు. వాయువే జలములకు స్థానము. వాయువునకు జలములే స్థానములు. తపనుడే జలస్థానాధిపతి. చంద్రుడే జలస్థానాధిపతి. నక్షత్రములే ఉదకములకు ఉనికిపట్టు. పర్జన్యుడే జలస్థానాధిపతి, మేఘమునకు జలములే స్థానములు. సృష్టితో పంచభూతముల అన్యోన్యాశ్రయమును, సృష్టిరహస్యమును తెలుసుకొని, ఆత్మదర్శకుడైన యోగీశ్వరుడే యోగీశ్వరేశ్వరుని దర్శించగలుగుతున్నాడు. అట్టి యోగీశ్వరులు తపస్సు చేసుకొనుటకు ఇట్టి సెలవులనే వరించెదురు. ఇహపరానందదాయకము లయిన ఇట్టి పుణ్యతీర్థములనే సరాగులు, విరాగులు గూడ కోరి తరింతురు.

## 'ఓం, తత్ సత్'

నయాగరా జలపాతమును తొలిగాణగా గొని వివేకానందు డీరీతిన పాశ్చాత్యులకు బోధించిన ఆధ్యాత్మప్రబోధమును యోగ జలపాతసందర్శనాపేక్షకులమైన మనమొకసారి. సంస్మరింతము "ఓం, తత్ సత్ —అనుతత్వమొక్కటియే మాయాతీతము. కాని భగవంతుడు నిత్యుడై వెలుగొందుచున్నాడు. నయాగరాజలపాతము ఉన్నంతవరకు అందు ఇంద్రధనుస్సులు వెలుగొందుచుండును. కాని, నీరు నిరంతరముగా ప్రవహించుచునే యుండును. ఈ జలపాతమే జగత్తు. ఇంద్రధనుస్సే సాకారదైవము. రెండును శాశ్వతములే. జగమున్నంతవరకు భగవంతుడును ఉండును. భగవంతుడు జగమును, జగము భగవంతుని సృజించుచున్నవి. రెండును నిత్యములే. మాయ సత్తుకు కాదు. అసత్తుకూ లేదు. నయాగరా జలపాతమును, అందలి ఇంద్రచాపమును గూడా మాయావరణమునుండి గాంచబడు నిత్యనిర్వికారబ్రహ్మమే కాని మరియొకటి కావు !!"

## యాత్రికుల భావచిత్రములు

జోగ్ జలపాతమును దర్శించినవారి మనోఫలకము లందు చిత్రవిచిత్ర రీతుల చిత్రములు హత్తుకపోవును. ఒక భావకవి జోగ్ సందర్శనము తన వధూప్రథమసమాగమమును స్ఫురింపచేయుచున్నది అని వ్రాసెను. అద్వితీయాఖండపరిపూర్ణానందవారిధిలో మునిగిపోయిన ఈ మనుష్యపరమాణువులు, ఈ జలపాతమహత్వమెన్న యత్నించుటకన్న అవివేకము వేరొండు లేదని ఒక యాత్రికుడు వ్రాసెను. "హృదయసఖీ - ఈ జలపాతమును చూచినపుడు నీ వియోగమువలన బాధపడుచున్నాను" అని మరొకడు ఒక గీతమును రచించెను. ఉదాత్తపథప్రబోధకమూ, వైరాగ్యమార్గదర్శకమూ అయిన ఈ జలపాతము పరబ్రహ్మమునకు నాచే కైమోడ్పులు ఇప్పించుచున్నదని మరొక భక్తుడు వ్రాసెను.

జగత్ప్రసిద్ధుడైన సర్ మోక్షగుండం విశ్వేశ్వరయ్యగారు జనవరిమాసమున ఈ జలపాతమును దర్శించి ఇటుల వ్రాసినారు:

"నేననేకపర్యాయములు జోగ్‌ను కంటిని. ఇప్పటికీ తనివి తీరడంలేదు"

ఇటుల ఎవరి భావనకు అలవి అయినంతమటుకు వారు జోగ్ జలపాతమును ప్రశంసించినారు.

ఈ జలపాతమును చూచినవెంటనే నాకు ఒక ఊహకలిగినది. ఈ కవులూ, గాయకులూ, వైతాళికులూ, శిల్పులూ, రాజకీయవేత్తలు, నిత్యజనసంఘోషజనితములైన పట్టణములలో తమ సమావేశముల జరుపుకొనుటకన్న ఇట్టి ప్రశాంత, ప్రవిమల దివ్యస్థలముల ఏల సమావేశము కారా అని! సంకల్పసిద్ధులకు సదాశయపరులకు సామాన్యముగా అసాధ్యమైనది అంటూ ఉండదు. దుస్సహ, దురంత సంసార జంఝూయమానదశలో ఉన్నవారికి అపూర్వమగు ప్రకృతి రామణీయకత అనన్యములగు ఆనందదృశ్యములు సాగరమున దరీ అంతూ గానక కొట్టుమిట్లాడువానికి ఒక చిన్న నావ చేతి కందినట్లే. ఆ జగత్కర్ణధారికృప మనపై బరిగినపుడే మన శక్తి సాధనసంపత్తు లొనగూడును.

ఉదయము తొమ్మిది గంటలకు మేము శివమొగ్గ (షిమోగా) చేరుకొంటిమి. మేఘములు, మేఘములతో పాటు వర్షములూ మాతో కూడానే వచ్చినవి. దారిపొడుగునా అవి వదలలేదు. షిమోగా నుంచి 80 మైళ్ళు సాగరంమీదుగా ద్వాదశినాడు రెండుగంటలకు జోగ్ చేరితిమి. మధ్యేమార్గమున అనేక మత్తకరీంద్రబృందములు, అటనట చెంగలించు లేళ్ళగములు, కలకల స్వనములొనర్చు శుకపికాదికములు, అంబరము నావరించిన మేఘమాలికలచే ఆనంద ముప్పొంగ నృత్యము లొనర్చు మయూరతతులు, నభోవాహినీ లహరీశీతల గంధవాహపరిఖేలన్మంజరీసౌరభ గ్రహణోందిందిరతుందిలంబులైన కాంతార సంతానములు మమ్ములను మరో ప్రపంచమునకు గొనిపోయినవి.

జలపాతమునకు కొలదిదూరముననే ఒక చిన్న ఆనకట్ట ఉన్నది. ఈ నదీజలములను 1200 అడుగుల ఎత్తువరకు గొనిపోయి విద్యుచ్ఛక్తిఉత్పాదనకు వినియోగించుచున్నారు. 120 వేల కిలోవాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పత్తి అగుటకు నాల్గు 12 వేల కిలోవాట్ల యంత్రములు నాల్గు 18 వేల కిలోవాట్ల యంత్రములు నెలకొల్పబడుచున్నవి. ఈ ప్రాంతమున యూనిట్‌కు దీపములు వెలిగించుటకు పావలా పరిశ్రమకు, వ్యవసాయమునకు యూనిట్‌కు అణా చొప్పున వసూలు చేయబడినదని అధికారులు తెలుపుచున్నారు.

ఇంకను మరొక డామును కట్టినచో ఇంతకు మూడు రెట్లు విద్యుచ్ఛక్తి నుత్పత్తి చేయవచ్చునను చున్నారు. ఈ ప్రదేశమునకు మూడుమైళ్ళదూరములో ఒకకొండ దగ్గర ఈ డాము కట్టవచ్చునని యోచంచబడుచున్నది. ప్రస్తుతము 48 వేల కిలోవాట్లే విద్యుచ్ఛక్తి ఉత్పత్తి అగుచున్నది. 120 వేల కిలోవాట్లు కార్యక్రమమూ ఉన్నది. ఇంకను వృద్ధిచేసిన 360 వేల కిలోవాట్లు అదనముగా ఉత్పత్తిచేయవచ్చును.

## పరిసరములు

జలపాతమున కవతల ప్రాంతము బొంబై రాష్ట్రము. ఇవతల మైసూరు. జలపాతమున కెదురుగనే మైసూరు రాజ్యములో, 1896 లో ఒక డామ్ నిర్మింపబడినది. హిరబ్ సాగర్ 1947 లో నిర్మింపబడినది. 1948లో విద్యుచ్ఛక్తికార్యక్రమమూ ఉపక్రమించబడినది. డాముకైన ఖర్చు రూ 76 లక్షలు. ఇతర హైడ్రోఎలెక్ట్రిక్ వర్కుస్ 565 లక్షలు. భద్రావతివద్ద "స్విచ్ ఆఫ్" స్టేషను ఉన్నది.

ఈ ప్రాంతమున ఒకటి రెండు హోటళ్లు ఉన్నవి. పి. డబ్ల్యు. డి. బంగళాలో నాల్గు గదులు ఉన్నవి. కో - ఆపరేటివ్ స్టోరు, హాస్పిటల్, మిడిల్ స్కూలు, ఆఫీసర్ల క్లబ్బు ఉన్నవి. నాల్గువేలమంది జనాభా ఉన్నారు. 14 గురు ఆఫీసర్లు 400 మంది ఉద్యోగులు ఉన్నారు. ఇక్కడ ఉండేవారందరూ దీనికి సంబంధించిన ఉద్యోగులే. 1865 లో ఈ జలపాతమును రాయల్ ఇంజనీర్లు కనుక్కొన్నట్లు రికార్డులు తెలుపుచున్నవి. ఈ నదివద్దనే 16 మైళ్ళపైన గెరొస్సొప్ప అను గ్రామము ఉన్నది. ఈ జలపాతమునకే గెరొస్సొప్ప (లేక) జాగ్ అని పేరు. షిమోగా జిల్లా తీర్థహల్లి తాలూకాలో శరవతి నది జనించి, 150 మైళ్ళు ప్రవహించి హానావావద్ద అరేబియా సముద్రమున సంగమించుచున్నది. జలపాతమున కెగువ 13 మైళ్ల దూరమున ఒకడాము ఉన్నది. అచ్చట 18 అంగుళ వ్యాసముతో 11 సైఫన్ల (గరాట్లు) ఉన్నవి. వరదనీటిని కంట్రోలుచేయుటకు, విద్యుదుత్పత్తికి, వ్యవసాయమునకు, పడవలు పోవుటకుగూడా ఈ ప్రాజెక్టు సంకల్పించబడినది. ఇప్పుడు 5 వాలు క్యూసెక్కుల జలములనే ఉపయోగించుచున్నారు.

## రాకపోకల సౌకర్యములు

జలపాతము ఉన్న ప్రదేశమున సముద్రమట్టమునకు 1600 అడుగుల ఎత్తున ఉన్నది విహంగమార్గమున అరేబియా సముద్రము 25 మైళ్ళు. బొంబాయి పునుంచి వచ్చువారు హుబ్లినుంచి సిర్సి, సిద్ధాపూర్ మీదుగా 90 మైళ్ళు ప్రయాణం చేయవలసిఉండును. కేవువరకు తిన్నగ బస్సులు ఉన్నవి. నవంబరునుంచి మార్చివరకు యాత్రికులు సగటున దినమునకు 200 మంది వస్తూఉంటారు. బెంగుళూర్ హరిహర్ లైను బెరూర్ వద్దచీలి, తలగొప్పవరకు రైలుమార్గము ఉన్నది. అక్కడనుంచి పదిమైళ్లు బస్సు. ఈ హైడ్రో ఎలెక్ట్రిక్ వర్క్సు సూపరింటెండెంటుగా ప్రస్తుతం డీసాగారు వ్యవహరించుచున్నారు. పాశ్చాత్యదేశములలోని ప్రాజెక్టులు చాలావరకు ఆయన చూచి వచ్చినవారు. కర్మాగారమునకు కావలసిన పరికరములు స్థానికముగానే సమకూర్చబడుచున్నవి. సర్ మోక్షగుండం విశ్వేశ్వరయ్యగారు ప్రాజెక్టునిర్మాణాలోచనకు ఎంతో కృషిచేసి ఉన్నారు.

జలపాతము ఒక దిమ్మనుంచి అయిదు భాగములుగా పడుచుండును. రాజు, రాణీ, రాడార్, రాకెట్,- అని అందు నాల్గింటికి ఎవరో పుణ్యాత్ములు నామకరణ మొనర్చినారు.

శరావతి వర్షఋతువగుటచే ప్రచండమైన వరవడితో ఉన్నది. పైన అయిదుగా బయలుదేరిన జలపాతములు భూపతనమై ఒక సరస్సుగా మారుచున్నవి. జలపాతము నుండి సరస్సునకు 1250 మెట్లు ఉన్నవి. శరదృతువులో యాత్రికులు క్రిందకు వళ్ళి స్నానముచేయవచ్చును. వర్షఋతువులో సాధ్యముగాదు. రాజా జలపాతము క్రింద 100 అడుగులలోతు, 300 అడుగుల నిడివి. 2506 అడుగుల వెడల్పుగల సరస్సు ఉన్నది.

1946 నుంచి యాత్రికుల సంఖ్య పెరిగినది. ఇచ్చట వర్షములు సాలుకు 160 అంగుళములనుంచి 200 అంగుళములవరకు పడుచుండును. ఆనకట్ట ప్రాంతమున 100 అంగుళముల వర్షము పడును. విద్యుత్ నిర్మాణ యంత్ర నివేశనస్థలము సముద్రమట్టమునకు 436 అడుగుల ఎత్తున ఉన్నది. శివసముద్రం వద్ద 410 అడుగుల క్రిందకు దిగవలసి ఉండగా ఇక్కడ 1626 అడుగులు దిగవలసి ఉండును. మలేరియా అంతగా బాధించుట లేదు

ఈ ప్రాంతము మైసూరుసంస్థానములో వాయవ్యదిశను ఉన్నది. ఫోర్ బ్సు, హాయత్ ఇంజనీర్లు ఈ ప్రాజెక్టునిర్మాణమున కెంతయోకృషిచేసినారు. ఇచ్చట ఉపయోగించు ఇనుము ఉక్కు చాలావరకు భద్రావతి, తప్పితే తాతాకంపెనీనుండి తెప్పించుకున్నారు.

## రాయలసీమకు 'జ్యోతి'

జోగ్ మన రాయలసీమకుగూడా జ్యోతిని ప్రసాదించుచున్నది. మైసూరులో పరిశ్రమాభివృద్ధికి మైసూరు సంస్థాన అభ్యుదయమునకు జోగ్, శివసముద్రము ఎంతగనో తోడ్పడుచున్నవి. ప్రపంచములో ఎక్కడ లేనిదీ, మైసూరులో లభించునను కన్నడ సామెత ఒకటి ఉన్నది. మహాబలేశ్వర స్వామి ఉన్న శ్రీ గోకర్ణక్షేత్రము ఈ ప్రాంతమునకు 40 మైళ్ళలో ఉన్నది.

ప్రాజెక్టులో ముఖ్యమైనవి 25,000 లక్షల ఘ. అ. నీరు ఉండే రిజర్వాయరు. (2) పవర్ చానలులోకి నీటిని మళ్ళించుటకు కట్టిన ఆనకట్ట (8) పవర్ ఛానల్ (4) ముఖతటాకము, (5) నీటిగొట్టాలు, (6) విద్యుదుత్పత్తిస్థలము. నీటి రిజర్వాయరు వేసవిలో 25 క్యూసెక్కులనుండి వర్షాకాలంలో 20,000 క్యూసెక్కుల నీటిని భాగించుటకు అనుకూలముగా సైఫన్లతో నిర్మింపబడుతోంది. 1500 క్యూసెక్కులతో విద్యుదుత్పత్తి అగునట్లు నీరు నిగ్రహింపబడును. రిజర్వాయరు జలపాతమునకు 15 మైళ్ళపైన ఉన్నది. నదీగర్భమునకు 104 అడుగుల యెత్తున ఆనకట్ట ఉన్నది. 20,0000 క్యూసెక్కులవరదనీరు 10 అ. X 25 అ. స్లూయిసులగుండాను 18 అ. వ్యాసముగల 11 గరాట్లగుండా ప్రవహించును.

రిజర్వాయరులో నిలిపిన నీటిని నదీలోయలోనికి వదిలి, పదిమైళ్ళక్రింద కరగల్ వద్ద చిన్న ఆనకట్ట కట్టినారు. భూమి అనువుగా లేనందున ఆనకట్టవద్దనే పవర్ ఛానలు కట్టుటకు వీలుపడలేదు. కరగల్ వద్దనుండి పవర్ ఛానల్ నిర్మింపబడినది. కరగల్ ఆనకట్ట 21అ. ఎత్తున ఉన్నది. ఇక్కడ ఒక క్రొత్త వంతెన ఉన్నది. ముఖ సాగరమువరకు విద్యుదుత్పత్తికారకమైన నీటికాలవ మూడు మైళ్ళు తీసుకొనిపోబడుచున్నది. 1500 క్యూసెక్కుల నీటితో విద్యుదుత్పత్తికి నీటిని గొట్టములలో దాపుటకు గొనిపోవుదురు. 72 అంగుళముల వ్యాసముగల నీటిగొట్టము ముఖతటాకమువద్ద చూడదగిఉన్నది. 1626 అడుగుల దిగుటకు విద్యుదుత్పత్తిస్థానమునకు రెండు ట్రాలీమార్గము లున్నవి.

“ఆపోవా ఇదగ్ం సర్వం విశ్వా
భూతా న్యాపః ప్రాణావా ఆపః!
పశవ ఆపోఽన్నమాపోఽమృత
మాప స్సమ్రాడాపో విరాడాప
స్స్వరాడాప శ్ఛందాగ్ం స్యాపో
జ్యోతీగ్ం ష్యాపో యజూగ్ం ష్యాప
స్సత్యమాప స్సర్వా దేవతా ఆపో
భూర్భువస్సువ రాప ఓమ్.”

---

**కథానిక:**

# ప్రజాపూర్ వింత

ఆనాడు ఆగస్ట్ 15 ... స్వాతంత్ర్యదినం . ప్రజాపూర్ వీధుల్లో జనం గుంపులు గుంపులుగా చేరి గుసగుసలాడుకుంటున్నారు. అందరూ రంగన్న గుడిసె వైపు పోతున్నారు. . పోతూ మధ్య మధ్య మాటలూ - అరుపులూ! అందరిలోనూ ఆశ్చర్యం అంచులు దాటిపోతున్నట్లు స్పష్టంగా కనపడుతోంది. ..

"ఇలాంటి విచిత్రం జరుగుతుందంటావా ?"

"ఏమో ! ఎందుకు జరక్కూడదూ ? జగన్నాటక సూత్రధారి ఆడించే నాటకం యిదంతా ! ఇందులో యెలాంటి వింతలైనా జరగొచ్చు మరి !"

"ఇంతకీ రంగడి పెళ్ళాం అదృష్టం !... ఒకరా.. యిద్దరా !.. !"

"అహ్హ హ్హ హ్హ హ్హ ! హీ హీ హీ !"

"ఎందుకురా అలా పళ్ళికిలిస్తావ్ ? ఏవుందీ యిందులో నవ్వడానికి ?"

"ఏమీ లేదు బాబాయ్... ఈ రంగడు ... మాట్టాని కట్లా ఒక్కి పీచుగా ఉంటాడు... వీడి దుంప తెగా..."

"దీంతో వాడి కెక్కడలేని గర్వం వచ్చిందిట ! పొద్దున్నుంచీ తెగతాగేస్తున్నాడు ! ఈపాటికి పూర్తిగా కైపులో ఉంటాడేమో !"

"అవును మరీ ! సంతోషం కదూ ?...నీ మాదిరిగా యెన్నాళ్ళకీ -"

"అరే ! దాంట్లో వాడిగొప్పే వుందోయ్ ?... వాడి పెళ్ళాన్ని చెప్పుకోవాలి గానీ."

"అది సరేగానీ...పంతులూ . యిట్లాంటి అద్భుతం యెప్పుడైనా జరిగిందా ఆ తెల్ల వాళ్ళ దేశంలో ?"

"ఓరి !... ఈ విషయంలో మనతో వాళ్ళేం వస్తార్రా !... వాళ్ళ దేశంలో వాళ్ళందరూ వట్టి దద్దమ్మల్రా !"

"అయితే యింకేం ?.. రంగడి పేరూ లచ్చి పేరూ ప్రపంచం అంతా మోగిపోతుందన్నమాటే."

"సందేహ మేవిట్రా!. వాళ్ళతోబాటు మన వూరిపేరూ మోత పుట్టిపోతుంది చూడూ పత్రికల్లో !"

*      *      *      *

ఆనాడు భీమనగరంనుంచి పోస్టుజవాను ప్రజాపూర్‌లో ఉత్తరాలియ్యడానికి వచ్చినపుడు ఈ వింతవార్త అతని చెవుల్లో పడింది .. అతడు దాన్ని భీమనగరం పోస్టుమాస్టర్ గారికి చెప్పాడు. పోస్టుమాష్టారికి ఇంటిప్రక్కనే ఉన్న డాక్టర్ కుందన్ లాల్ గారికి చెప్పేసేదాకా నిద్రపట్టలేదు ! ఆనాడు సాయంకాలం పట్టణ కాంగ్రెస్ అధ్యక్షుడు లాలాబన్సీదార్ రోజూ వచ్చేలాగే ఇంజక్షన్ కోసం వచ్చినప్పుడు డాక్టర్ గారు ఆయనకు వివరించారు ఈ ప్రజాపూర్ వింతను !

ఆసుపత్రినుంచి లాలాబన్సీదార్ గారు సరాసరి గాంధీపార్కులో జరగబోయే స్వాతంత్ర్య దినోత్సవ సభకు అధ్యక్షత వహించడానికి వెళ్తూండగా, దారిలో మున్షీ ప్రజ నారాయణగార్ని కలుసుకోవడం తటస్థించినది. ప్రజ నారాయణ మునిసిపల్ స్కూల్లో పనిచేస్తూ 'దేశదీపక్' పత్రికకు విలేఖరిగా కూడా ఉంటున్నాడు. ఆయన లాలాజీ చెప్పబోయే ఉపన్యాస పాఠాన్ని తన పత్రికలో ప్రచురించే నిమిత్తం ముందుగా ఒక 'కాపీ' యివ్వమని కోరాడు. అలాగేనని లాలాజీ తయారుగా ఉన్న 'కాపీ' ని కోటుజేబులోంచి తీసి అందించాడు. తరువాత ఇద్దరూ అవీ యివీ మాట్లాడుకునే సమయంలో మాటవరసగా ప్రజాపూర్ వింతవిషయంకూడా చెప్పాడు లాలాజీ. ఎల్లప్పుడూ వింతవార్తలకై అన్వేషించే ప్రజ నారాయణకి పెన్నిధి దొరకినంత సంతోషం ! కుతూహలం యెక్కువైంది.

"ఇది నిజమేనంటారా లాలాజీ ?... ఇటువంటిది సంభవమా ?"

"అయివుండొచ్చు... నాకైనా డాక్టర్ కుందన్‌లాల్ గారే చెప్పారు.. "

"అయితే తప్పకుండా నిజమే అయి వుండాలి. . అసలిటువంటి విచిత్రమైన కేసును ఆయనే స్వయంగా ట్రీట్ చేసి వుంటాడు."

"తప్పకుండా. . తప్పకుండా.. " అన్నారు లాలాజీ. అప్పటికే జనంతో నిండిపోయిన పార్కును సమీపించడం చూసి గాంధీటోపీ సర్దుకుంటూ !

గాంధీపార్కులోని ప్రజానీకం తామింతవరకూ ఎదురుచూసే 'నాయకుడు' వచ్చేసరికి "లాలాబన్సీదార్‌కీ జై !" అని హర్షధ్వానాలు చేశారు...

*      *      *

మరునాడు 'దేశదీపక్' పత్రికలో లాలా బన్సీదార్ గారి ఉపన్యాసం ప్రకటింపబడకపోయినా, మున్షీ ప్రజనారాయణ గారిచే పంపబడిన వార్త తాటికాయలంత అక్షరాల్తో మొదటిపేజీ నలంకరించింది .

"ప్రజాపూర్‌లో విచిత్ర సంఘటన... ఒక సామాన్యస్త్రీ ఆయిదుగురు శిశువులను ప్రసవించింది ! స్వాతంత్ర్యదినోత్సవ సందర్భంలో భారతమాతకు కానుక !

"భీమనగరానికి పదిమైళ్ళ దూరంలో ఉన్న ప్రజాపూరనే గ్రామంలో ఒక కాపు పడుచుకు అయిదుగురు శిశువులు కలిగారని మా విలేఖరి వ్రాస్తున్నాడు. ఈ అయిదుగురిలో ముగ్గురు మగపిల్లలూ, యిద్దరు ఆడపిల్లలని తెలుస్తోంది. భీమనగరం గవర్నమెంట్ హాస్పిటల్‌లో ప్రధాన వైద్యుడైన డాక్టర్ కుందన్‌లాల్ గారు స్వయంగా ఈ విచిత్రమైన కేసును పరిశీలించారట. తల్లీ - పిల్లలూ క్షేమంగా ఉన్నట్లు వారు మా విలేఖరికి తెలిపారు."

(34-వ పేజీ చూడుడు)

# మనదేశం

(8-వ పేజీ తరువాయి)

లోనూ (మొదటిరోజు 4 గంటలు రెండవ రోజు గం 11½ లు) ఏడు ముఖ్యమైన తీర్మానాలు ఆమోదించబడినాయి

ముందు ఈ తీర్మానాలు కార్యవర్గం చేతనూ, విషయనిర్ణయ సభ చేతనూ, ఆమోదించ బడినాయి అధ్యక్షుడు సర్వసభ్య సమావేశంలో ఉపన్యాస మిచ్చారు. ఈఉపన్యాసం ఇంతకు చాలరోజులకు ముందే తయారయింది సంస్కృతపద సమ్మిళితమైన వీరి హిందీ ఉపన్యాసం చదవడానికి రెండున్నర గంటల సేపు పట్టింది కొన్నిరోజులకుముందే తయారైన ఈఉపన్యాసంలోని అంశాలన్నీ పండిట్ నెహ్రూ కోరిన రీతిని కార్యవర్గంచేసిన తీర్మానాలతో ఏకీభవించి ఉన్నాయి ఆదర్శాలలో ఆశయాలలో టండన్ గారికీ, పండిట్ నెహ్రూ కీ ఆట్టే అభిప్రాయ భేదాలు కనిపించలేదు మరైతే ఈవిషమ వాతావరణానికి హేతువేమిటి? తెగని ప్రశ్నలకు, చిక్కువిడని సమస్యలకు, తీరని సందేహాలకు మూలమేమిటి? ఈశంక నాసిక్ కాంగ్రెస్‌లో తీరడానికి బదులు మరింతతీవ్రంగా కాంగ్రెస్ వాదుల హృదయాలనుపీడిస్తున్నది.

కార్యవర్గంలోనూ, విషయ నిర్ణయసభలోనూ వాగ్వివాదాలు ఆట్టే జరక్కుండా పండిట్ నెహ్రూ పరిపాలనా విధానాలు ఆమోదించబడ్డంతో, కాంగ్రెస్ సమావేశంలో ప్రతినిధులకు తీర్మానాలపైన శ్రద్ధ తగ్గింది సభ్యులు కునుకుతూ, జోగుతూ రెండు రోజుల సమావేశాన్ని గడిపేశారు. శరణార్థుల్ని గురించి కిద్వాయ్‌గారు పాకిస్తాన్‌లోని హిందువుల దీనగాథను వివరించినప్పుడూ, పండిట్ నెహ్రూ ఉపన్యసించినప్పుడూ తప్ప సభ్యులకు ఆసక్తి ఇంకిపోయింది పార్లమెంటులో మంత్రుల ఉపన్యాసాలే పునశ్చరణం చెయ్యబడినందువల్ల కాంగ్రెస్ ప్రతినిధులు మళ్ళీ ఈ సమస్యల్ని గురించి యోచించవలసిన అగత్యం లేకపోయింది పైన మబ్బు లావరించి, వాతావరణంలో వ్యాపించిన నిశ్చేష్టతే పెండాల్‌లో సర్వత్రా ఆవహించింది. తుపానురాగలదని ఊహించినవారికి ఉపన్యాసాల ముసురు తుంపరమాత్రమే లభించింది.

అధ్యక్షుడు టండన్ అంత్యోపన్యాసంలో కాంగ్రెస్ బలహీన పడలేదని చెప్పినప్పుడు కాంగ్రెస్ ప్రతినిధులు తమ ప్రాతినిధ్య భావం క్షీణించిందని తలపోసి వుంటారు దేశసేవాసక్తి కాంగ్రెస్ వాదుల్లో పెంపొందాలన్నప్పుడు, కర్తవ్యతా విమూఢులైన కాంగ్రెస్ వాదులకు ఈ మాటలు గాలిలో తేలిపోతున్నట్లనిపించింది

ప్రజల్లో నీతివర్తనను అలవరించవలసినవారు కాంగ్రెస్ వారేనని టండన్ గారన్నారు. అధికార నిర్వహణలోనే గొప్పవుందనుకోడం పొరపాటనీ, సేవవల్ల, త్యాగంవల్ల ప్రజల ఆదరణను సాధించడం కూడా ఉత్కృష్ట కార్యమేననీ టండన్ చెప్పినప్పుడు కాంగ్రెస్ వారు ఆత్మపరిశోధన చేసుకున్నారో, లేదో తెలియదు కాని నిత్యం ఉపదేశాల కలహాటుపడిన వారికివి ఎంతవరకూ ఉపకరిస్తాయి? పదేపదే గాంధి మహాత్ముని నామం ఉచ్చరిస్తూ సర్వదుశ్చేష్టలకు దిగుతున్న కాంగ్రెస్ వాదుల పట్ల నిరసన సూచకంగా పండిట్ నెహ్రూ నాసిక్ ఉపన్యాసాలలో ఒక్కమారుతప్ప గాంధీజీ పేరు ఉచ్చరించలేదు ఆ మాటను సభ్యులకు చెప్పే వుంచారు పండిట్ నెహ్రూ అదేరీతిగా ఆదర్శాలు ఉపదేశాలూ విని విని చేతలలో పూర్తిగా వాని ఆవశ్యకతను విస్మరించిన కాంగ్రెస్ వాదులకు పై ఉపదేశం ఎంతఒంటపట్టిందో ఎంత విరోధభావం కలిగించిందో అంచనా వెయ్యడం కష్టం

క్రియాశూన్యమైన ఉపదేశాలు మిగిలి నాసిక్ కాంగ్రెస్ ముగిసింది. కంట్రోల్స్ మొదలైన వ్యవహారాలలో ప్రభుత్వ విధానాలు బలపడినాయి అధికారంలో లేని కాంగ్రెస్ వాదులు కర్తవ్యతా విమూఢులై తిరిగి తమ గ్రూప్ రాజకీయలలోకి ఇళ్ళకి చేరుకున్నారు.

[సీతారామ్]

---

"హరి. ఇంత డబ్బెల్లా సంపాదించావురా రంగా?"

"అదంతా మా ఆవిడ చలవరా"

"అనుకూలవతి కాబోలు, అదృష్టవంతుడవ్."

"అది కాదురా. ఆవిడ ఖర్చుకి తట్టుకోవాలంటే ఎంత ఆర్జించాలీ అని ఇప్పటికీ తేలక పరిశీలిస్తున్నాను."

---

# ప్రజాపూర్ వింత

(32-వ పేజీ తరువాయి)

ఈ వార్తవిని చుట్టుప్రక్కల గ్రామాల ప్రజలు తండోపతండాలుగా వచ్చి పశుతున్నారు. ఆ పంచపాండవులనూ కుంతీదేవినీ దర్శించిపోతున్నారు. ఈవార్త భీమనగరంలో కూడా సంచలనం కలిగించింది. భగవంతుని పై నమ్మకంలేక పెడదారి పడుతున్న నేటి లోకాన్ని మరమ్మతుచేసి మళ్ళీ ధర్మసంస్థాపన గావించడానికి వీరు అవతారమెత్తారని కొన్ని సనాతన వర్గాలవారు భావించారు. కాగా, జాతీయ వర్గాలవారు మాత్రం యీ చిత్రసంఘటనను పూర్తిగా రాజకీయ దృక్పథంలో పరిశీలిస్తున్నారు. స్వాతంత్ర్యదినోత్సవాల సందర్భంలో జరిగిన ఒక బ్రహ్మాండమైన సభలో ఉపన్యాసిస్తూ శ్రీ లాలాబన్సీదార్ గారీవిధంగా ఉద్ఘాటించారు "నేడు పర్వదినం ఈ పవిత్ర సమయంలో ప్రజాపూర్ కి చెందిన ఒక కాపు పడుచు భరతమాత పాదపద్మాలకు ఒక్కసారిగా అయిదుగురు శిశువులను అర్పించి ధన్యురాలయింది!"

* * * *

'దేశదీపక్' లోని వార్త దాదాపు 750 దేశీయ వార్తాపత్రికల్లో-పదహూడు భాషల్లో-ప్రకటింపబడింది. విదేశ విలేఖరులు తమతమ దేశాలకు కూడా పంపారు. వెంటనే రంగన్నా, లక్ష్మమ్మలపేర్లు ప్రతిదేశపుపత్రికలలోనూ ప్రత్యక్షం అయినై. దాదాపు నూటపాతిక స్వదేశపత్రికలూ. యాభైఐదు విదేశపత్రికలూ 'ప్రజాపూర్ వింత' నుగురించి సంపాదకీయాలు వ్రాసినవి

ఒక సుప్రసిద్ధ జాతీయ దైనిక పత్రిక ఇలా వ్రాసింది. "అశేషప్రజానీకానికి 'పర్వదినం అయిన ఆగస్ట్ 15 న పంచపాండవులవంటి అయిదు శిశురత్నాలను భారతమాతకు కానుకలుగా అర్పించిన ఆకాపు పడుచు, దేశభక్తిలోనూ, దేశస్వాతంత్ర్యానురక్తిలోనూ, జాతీయప్రభుత్వాదరంలోనూ యెవరికీ తీసిపోజాలదని రుజువు చేసినది. మనరైతు సోదరుడు రంగన్నగారినీ, అతని అర్ధాంగి లక్ష్మమ్మనూ హృదయపూర్వకంగా అభినందిస్తున్నాం ఉపన్యాసవేదికల పై గంటల తరబడి వాగటంతప్ప కార్యక్షేత్రంలో పిసరైనా ఉత్పత్తిచేయలేని మన కమ్యూనిస్ట్, సోషలిస్ట్ సోదరులకు రంగన్ననూ, లక్ష్మమ్మనూ ఆదర్శప్రాయులుగా చూపగోరుతున్నాం.."

'దేశసైనిక్' అనేవార పత్రిక ఈవిధంగా వ్రాసింది.

"అత్యంతధైర్యశాలి అయిన యువతీలలామ, లక్ష్మమ్మ భారతదేశానికమిత గౌరవ సంపత్తిని తెచ్చిపెట్టింది.

. ఇకముందు మనం కెనడా కేమాత్రం తీసిపోయినట్లు భావించనక్కరలేదు" మాంట్రియల్ లోని వార్తాసంస్థ, కెనడా డియోనీబాలలు ఈ క్రింది టెలిగ్రాం పంపినట్లు తెలిపింది.

"భారత దేశపంచ బాలలకు కెనడా పంచబాలల అభినందనలు. ఈలోకంలోకి సుస్వాగతం తెలియ జేస్తున్నారు."

ఈ వార్తను "భారతభీష్మ" అను దినపత్రిక ఈవిధంగా వ్యాఖ్యానించింది.

"కెనడా ప్రజలు తాము భారత ప్రజలమైనమాతో సరి సమానులమని భ్రాంతి పడరాదు వారికికూడా అయిదుగురు శిశువులుండవచ్చు; కాని వారిలో అందరూ ఆడపిల్లలేననీ; మాలక్ష్మమ్మ సంతతిలో ముగ్గురికి తక్కువలేకుండా మగ పిల్లలున్నారనీ మరచి పోకూడదు."

'రాష్ట్రసేవక్' ప్రభుత్వానికొక విజ్ఞప్తి చేసింది:

"భారతీయులు లక్ష్మి, రంగన్నల అడుగుజాడల్లో పురోగమించినట్లయితే అచిరకాలంలోనే జనసంఖ్య రెట్టింపు కాగలదు. అప్పుడు మనం సంఖ్యాబలంతోనే ప్రపంచాన్నంతనీ మన అదుపులోకి తెచ్చుకోవచ్చును ప్రజాప్రభుత్వం ఈ సత్యాన్ని గుర్తించి పంచ బాలల జన్మలోని శాస్త్రీయ మర్మాలను సమగ్రంగా పరిశీలించి, వాటి కవసరమైన సూచనలనూ, సహాయములనూ అందించి వెంటనే భారత యువతుల ఆరోగ్యవృద్ధికై దేశంలోని సుప్రసిద్ధ వైద్య నిపుణులతో ఒక కమిటీని యేర్పరచాలి ప్రతి భారతయువకుడూ రంగన్న కావాలి! ప్రతిభారత యువతీ లక్ష్మమ్మ కావాలి!—అలా అయితే రేపే ప్రపంచాధిపత్యం సిద్ధిస్తుంది! సందేహం లేదు!"

ఈవిజ్ఞప్తిని ప్రముఖ సోషలిస్టు వారపత్రిక 'జనతా గెజెట్' తీవ్రంగా విమర్శించింది.

"మనదేశం ఇప్పటికే విపరీతమైన జనాభాతో నిండిపోయింది. సామాన్యప్రజానీకం 'అన్నమో రామచంద్రా' అని అలమటిస్తున్నారు. ఇల్లాంటి సమయంలో ఇటువంటి వ్యర్థమైన విజ్ఞప్తులవల్ల ప్రయోజనం శూన్యం ఇంకా జనాభాను పెంచి ఆహారసమస్యను విషమతరం చేయగోరుతున్నారా? ఇటువంటి దంభాలతో అమాయక ప్రజలకండ్లు కప్పి, వారు జరిపే న్యాయమైన పోరాటంలోని ఉత్సాహాన్ని సడలచేయాలని ప్రభుత్వాభిప్రాయ● కావచ్చు. కాని అది కేవలం అసంభవం. ప్రజలకళ్ళల్లో దుమ్ముకొట్టలేరు!...... సోషలిస్టుపార్టీ నినాదం వారిని మేల్కొలిపింది. తిండీ గుడ్డా యివ్వండి— లేకపోతే అధికారాన్ని త్యజించండి!"

కమ్యూనిస్ట్ పత్రిక "రెడ్ ఫ్రంట్" 'జనతా'లోని యీ సంపాదకీయాన్ని ఇలా వ్యాఖ్యానించింది:—

"కామ్రేడ్ లెనిన్, కామ్రేడ్ స్టాలిన్ల నాయకత్వంక్రింద మార్క్సిస్టు సైంటిస్టులెన్నడో మాల్తూజన్ థీరీనితిరస్కరించారు' ఈనాడు దేశంలో తిండికరువేర్పడిందంటే దానికి కారణం జనాభా పెరుగుదలకాదు- దానికి కారణం నెహ్రూపటేల్ ప్రభుత్వం అవలంబించే ప్రజావ్యతిరేకమైన పెట్టుబడిదారీ విధానం.. ప్రపంచంలోని పీడిత ప్రజానీకం కామ్రేడ్ రంగన్ననూ, కామ్రేడ్ లక్ష్మమ్మనూ సెల్యూట్ చేస్తోంది. 'రెడ్ ఆర్మీ'కి అయిదుగురు కామ్రేడ్స్ను అర్పించినందుకు అభినందనాలు."

ఒక ఢిల్లీ వారపత్రిక-ఒక కాపు యువతి అయిదుగురు పిల్లలతో నిలబడి 'రేషన్' అడుగుతున్నట్టూ - ఆహారమంత్రి మున్షీ గారికి గాబరాతో గాంధీటోపీ గాలిలో ఎగిరిపోతున్నట్టూ - ఒక కార్టూన్ ప్రకటించింది!

అఖిలభారత మహిళామండలివారు "లక్ష్మీడే" జరిపారు ఈ సందర్భంలో టాజ్ మహల్ హోటల్లో ఒక ఫ్యాన్సీడ్రెస్ ప్రదర్శనం జరిగింది ఇందులో 'ప్రజాపూర్ బాలలు' అనే ప్రదర్శనానికి ప్రథమ బహుమానం ఇవ్వబడింది

భారత్ లో ఈవిధంగా భారీ యెత్తున జనాభా పెరుగుదల జరగటం పాకిస్తాన్ కు క్షేమకరంకాదనీ - భారత్ లో ఇలాంటి విచిత్రసంఘటన జరగటం పాకిస్తాన్ యువతీ యువకులకు సవాలనీ- పాకిస్తాన్ ఇంక మేల్కొనాలనీ ఒక లాహోర్ పత్రిక హెచ్చరించింది.

బొంబాయి రోటరీక్లబ్బులో జరిగిన డాక్టర్ల సమావేశంలో "ప్రజాపూర్ వింత సంఘటనలోని కొన్ని సైంటిఫిక్ యాస్పెక్ట్స్"ను గూర్చి చర్చ జరిగింది.

ఈ విచిత్ర విషయాన్ని పరిశీలించడానికి అమెరికన్ డాక్టర్లు, సైంటిస్టులూ చేరి ఒక 'మెడికల్ మిషన్' త్వరలో ఇండియా రానున్నదని న్యూయార్క్ న్యూస్!... దీన్ని అతి తీవ్రంగా దుమ్మెత్తి పోస్తూ ఒక మాస్కోపత్రిక 'మెడికల్ మిషన్' అనే బురఖాతో వచ్చే అమెరికన్ ఇంపీరియలిస్టుల వలలో పడకుండా జాగ్రతగా

వ్యవహరించాల"ని ఇండియాను హెచ్చరించింది!

బాంబే-నాగ్‌పూర్-లక్నోలలోని శరణాలయాలు 'లక్ష్మీ' శరణాలయాలని నామకరణం చేయబడినయ్!

అమర్‌నాథ్ క్షేత్రంనుండి అప్పుడే వచ్చిన ఆత్మానందస్వామీజీ తాను ఒక రోజున మంచుగుహలో తపస్సమాధిలో నున్నప్పుడు, తనకు దివ్యదృష్టిలో-ఒక కాపు వనిత అయిదుగురు శిశువులను కంటుందనీ, వారిలో ఒకడు సాక్షాత్తూ శ్రీమహావిష్ణువు అవతారమనీ-దీనికి గుర్తుగా వాని యెడమపాదంమీద ఒక పెద్దపుట్టుమచ్చ ఉంటుందనీ-సెలవిచ్చారు.

వెంటనే కొందఱు యోగీశ్వరులు వారి పాదాలను పరీక్షించడానికి రంగన్న గుడిసెకు పయనమయ్యారు! ఒకయోగి-ముగ్గురు పిల్లలకీ పుట్టుమచ్చలున్నాయన్నాడు-కాదు' ఒక్కడికే ఉన్నదని మరొకడు వాదించాడు

లాసా పరిసర ప్రాంతంలో నివసించే ఒక గొల్లపడుచు ఆరుగురు శిశువులను ప్రసవించిందని టిబెట్‌నుండి ఒకవార్త రాగా-అది అతిశయోక్తిఅనీ, అసలు పుట్టింది ముగ్గురేననీ తేల్చబడింది. ఒక సైబీరియన్ సుదతికి యేడుగురు పిల్లలకు తక్కువ లేకుండా పుట్టారని వ్లాడివాస్టక్ నుండి 'టాస్' ప్రకటన వెలువడగానే, అది అంతా శుద్ధ అబద్ధమనీ-సోవియట్‌స్టంటనీ అమెరికన్ వార్తాసంస్థలు ఖండించినయ్!

ఈ విధంగా ఒకవారంరోజుల్లో ప్రపంచ పత్రికాలోకాన్ని రంగన్నా, లక్ష్మమ్మా వారి పిల్లలూ పరిపాలించారు! ఎక్కడ చూసినా వీరి విశేషాలే! ప్రపంచం మొత్తంమీద 'ప్రజాపూర్ వింత'నుగూర్చి ప్రకటింపబడ్డవన్నీ కలిపిచూస్తే, వారికి కనీసం ఒకకోటిరూపాయల విలువగల 'పబ్లిసిటీ' వచ్చివుంటుందని ఒక జర్నలిస్టు అంచనా వేశాడు!

* * *

ఇంతలో—లేడీ నీలకాంత్ సుపారీవాలా అధ్యక్షతక్రింద '(ఫ్రెండ్స్ అఫ్ రంగన్నా అండ్ లక్ష్మి' (రంగన్నా, లక్ష్మి స్నేహబృందం) అనే సంఘం ఒకటి స్థాపించబడింది ఈ విడ ఇరవైయేళ్ళు కాపరం చేసినా సంతాన భాగ్యం లేక పోవడంచేత, తన మమ కారాన్నంతటినీ కుక్కపిల్లలమీద కేంద్రీకృతంచేసిన ఇల్లాలు! ఈసంఘంవారు ఒక కమిటీని ప్రజాపూర్ పంపదలచి, దానికై లక్షరూపాయల విరాళానికై విజ్ఞప్తి చేశారు. వెంటనే కొద్దిరోజుల్లోనే రు 40,000 చేర్చ కలిగారు. ఏడుగురుసతీమణులున్నా, సంతాన భాగ్యం పొందలేకపోయిన ఒక ప్రముఖ పారిశ్రామిక వేత్త పదివేలరూపాయలువిరాళమిచ్చి తన ఔదార్యాన్ని ప్రకటించాడు!

ఒక డాక్టరూ, ఒక ప్లీడరూ, ఒక ప్రొఫెసరూ, ముగ్గురు పారిశ్రామిక వేత్తలూ, ఇద్దరు మహిళామణులూకల ఒక రాయబార వర్గం ఎన్నుకోబడింది. వీరి పేర్లను ప్రకటిస్తూ ఒక పత్రికా విలేఖరి, ఈ ఏడుగురు సభ్యుల సంతానం మొత్తం అయిదేననీ ఈ అయిదూ ఆ అయిదూ సరిపోయిందనీ కామెంట్ చేశాడు

యఫ్. ఆర్. యల్. (ఫ్రెండ్స్ ఆఫ్ రంగన్నా అండ్ లక్ష్మి) ఫండ్స్‌లో—రు 13,000 ప్రత్యేక విమానానికీ- రు 1,200 పూలదండలూ ఇత్యాదులకూ - రు 9,000 ప్రయాణభత్యాలకు, రు 7,000 ఆటవస్తువులకూ (ఈఆటవస్తువులన్నీ కమిటీ సభ్యుడైన సేఠ్ జవహరీ చాంద్ ఖిలోనావాలా గారి ఫ్యాక్టరీలో కొన్నవి) ఖర్చుచేయబడినవి. ఆటవస్తువుల మూలంగా సేఠ్ గారికి రు 600 లాభం రావడమే గాకుండా, పత్రికల్లో ప్రకటించడంవల్ల వేలకొలది రూపాయల విలువగల పబ్లిసిటీకూడా లభించింది! పిల్లలకు బహూకరించడానికి సంపాదింపబడిన వస్త్రాలకు రు 2000 ఖర్చయినవి ఈరెండు వేల రూపాయల్లో కొంత "కొరారిమల్ క్లాత్ మిల్స్" వారికీ, కొంత సేఠ్ చంద్ టైలరింగు హౌస్‌కీ పోయినయ్. (వీరిరువురూ యఫ్. ఆర్. యల్. మేనేజింగ్ కమిటీ సభ్యులు!) పాపలకు బహూకరింపబడే వెండి సామగ్రి - గ్లాసులు, ప్లేట్లు, టీకప్పులూ, కత్తులూ, స్పూన్లూ, ఫోర్కులూ, అయిదుసెట్లుఅన్నీ సేఠ్ సోనా చాందివాలా గారి షాపులోనివే! ఈసేఠ్‌జీకూడా కమిటీ సభ్యుడే!

ఈవిధంగా నలభైవేల రూపాయలూ జయప్రదంగా ఖర్చుపెట్టి, ఒక శుభదినాన కమిటీ పరివారం అంతా ప్రత్యేకవిమానం మీద పయనమయ్యారు - భీమనగరంలో విమానందిగింది. కమిటీసభ్యులు ప్రజాపూర్‌కి వెళ్లారుకార్లలో ప్రెస్‌రిపోర్టర్లూ ఫోటోగ్రాఫర్లూ, న్యూస్‌రీల్ కెమెరామెన్. అందరూ వారివెంట బయల్దేరారు— అంతా ఒక సైనికదళంలా చేరారు ప్రజాపూర్.

వీరి హడావుడితో ప్రజాపూర్ గ్రామవాసులంతా వీరివెంట పడ్డారు.. అందరూ రంగన్న గుడిసెనుసమీపించారు.

గుడిసెలో మత్తుగా పడివున్న రంగన్న ఈకోలాహలానికి లేచి బయటకు వచ్చి అందర్నీ చూచి, తన యెఱ్ఱనికళ్లను లేడీనీలకాంత్ సుపారీ వాలా మీదనిలిపి— యేమీ అర్థంగాక "ఏంటిది? ఏంటిదంతా?" అని అరిచాడు.

వాడిప్రశ్నకు సమాధానంగా లేడీనీలకాంత్ — ప్రొఫెసర్, డాక్టర్, లాయర్ గార్లచే తయారుచేయబడి, సిల్కుపేపర్ (కొరారీమల్ క్లాత్ మిల్సులోది) మీద ముద్రించబడిన ఉపన్యాసాన్ని తన సహజ సిద్ధమైన పెద్దకీచుగొంతుతో చదవడం ప్రారంభించింది—

"రంగన్న మహాశయా! శ్రీమతిలక్ష్మీబాయీ! ఈపవిత్రశుభసమయంలో భారత ప్రజానీకం తరఫున మీయిద్దరికీ ఇవేమాశుభాకాంక్షలు. ఇటీవల మీరు సాధించిన ఘనవిజయం భారత దేశచరిత్రలో ఒకనూతన ధ్యాయాన్ని ప్రవేశపెట్టిందంటే అతిశయోక్తికాదు. ఈనాడు మేము శ్రీమతిలక్ష్మీబాయిలో సాక్షాత్ భారతమాత స్వరూపాన్ని చూడగలుగుతున్నాం ఈ అయిదుగురు పసిపాపలూ మీకేగాదు; భారత దేశంలో ఉన్న ముప్ఫయ్అయిదుకోట్ల ప్రజానీకానికీ అత్యంత ప్రేమపాత్రులు వారు దైవాంశసంభూతులు- మనవైభవానికీ అతిశయానికీ వారే మూలం. అందుకేమనల్ని చూస్తే ప్రపంచానికి అసూయతో కన్నెఱ్ఱగా ఉంది. ఈనాటినుండి యీ పాపల పెంపకం - వారి బాగోగులూ, చదువుసంధ్యలూ, వివాహాలూ- మీ ఒక్కరిబాధ్యతే కాదు- భారతజాతి కంతటికీ ఆబాధ్యత ఉంది కనుక రంగన్న గారూ, లక్ష్మీబాయీ! మీసోదర దేశీయులు మీ ప్రియతమశిశువులకై పంపిన యీ కానుకలను దయతో స్వీకరించాలని కోరుతున్నాం"

అరమోడ్పు కన్నులతో- మత్తెక్కియెఱ్ఱబడ్డ దృష్టితో అప్పటిదాకాయీ "గందరగోళాన్ని" వింతగా పరికిస్తున్న రంగన్న ఒక్కసారి పకపకా వెకిలినవ్వు నవ్వాడు

"కానుకలా! బొమ్మలా! గుడ్డలా!.. అహ్హహ్హా!" అంటూ లేడీసుపారీవాలా చేతిలో సిల్కు గుడ్డలను లాక్కుని "యెళ్లండి- లోపలి కెళ్లండి అమ్మగారూ! ఎళ్లి పాపాయిలకియ్యండి కానుకలు!" అని-గుడిసెవైపుకు వంగి- "లచ్చి! . ఓలచ్చీ! ఏడవ్వాకే! కళ్లుతుడుసుకో! ఈళ్లందరూ మన బాబులికి ఎన్ని కానుకలు తెచ్చారో సూడవే! పాపాయిలకి పాలులేకపోతేయేం? రోగమొస్తే మందులేకపోతే యెవడిక్కావాలి? వర్షాలకి గుడిసెకురిసి, ఆళ్లు తడిసి జరమొస్తే ఎవరికిపట్టింది? లేవ్వే లచ్చి! లేచి ఈళ్లందరికీ దణ్ణం పెట్టు ముందు! పాపం! ఎంత దూరంనుంచి ఒచ్చారో! పాపలకి సిలుకు బట్టలూ బొమ్మలూ తెచ్చారే! రా సూడు సూడు!

నేటిప్రపంచం:

# ఐక్యరాజ్యసమితి సమావేశం

ఐక్యరాజ్య సమితి సర్వసభ్యసమావేశం 19 వ తేదీని ప్రారంభ మయింది. ఈ మారు సమావేశంలో ఆసియా సమస్యలు ప్రాధాన్యం వహిస్తాయనీ, అమెరికా రష్యాలు ఆసియాదేశాల మైత్రికోసం పోటీ చేస్తాయనీ లేక్ సక్సెస్‌లో అందరూ భావించారు.

ఇప్పటివరకూ చీనా సభ్యత్వసమస్య, సమితి నిబంధనల సవరణ ప్రధానాంశాలైనాయి.

గత సంవత్సరపు అధ్యక్షుడు జనరల్ రోములో అధ్యక్షతక్రింద సమావేశం ప్రారంభం కావడం తడవుగా భారత ప్రతినిధి బి. యన్. రావుగారు ఉపన్యాసవేదిక నెక్కి చీనా కమ్యూనిస్టు ప్రభుత్వ ప్రతినిధుల్ని సమితిలో ప్రవేశపెట్టాలని ప్రతిపాదించారు. తయారుగా ఇటువంటి తీర్మానాన్నే జేబులో పెట్టుకూర్చున్న రష్యన్ ప్రతినిధి వైషిన్‌స్కీ తెల్లబోయినాడు. కాని బి. యన్. రావుగారి తీర్మానం ఫలితం ముందే అందరికీ తెలుసును ప్రతికూలంగా 33 వోట్లుపడి తీర్మానం వీగిపోయింది.

పూర్వ అమెరికన్ విదేశాంగ మంత్రి జనరల్‌మార్షల్ ఇప్పుడు రక్షణశాఖామంత్రిగా నియమించబడినందువల్ల చీనాసభ్యత్వ సమస్య సందర్భంలో అమెరికా వైఖరి మారుతుందని ఆశించిన వారికి ఆశాభంగం కలిగింది. నవంబరులో అమెరికన్ కాంగ్రెస్ ఎన్నికలు జరిగేలోగా చీనాపట్ల అమెరికన్ ప్రభుత్వ వైఖరి మారదని స్పష్టపడింది. ఎన్నికల తరవాత మారినా ఎలా మారుతుందో తెలియదు భారత ప్రతినిధి తీర్మానాన్ని ప్రతిఘటిస్తూ అమెరికన్ విదేశాంగమంత్రి డీన్ ఎఛిసన్ తన వైఖరి సమర్థించుకోలేక పోయాడు

చీనాసభ్యత్వ సమస్యగురించి ఏడుగురు సభ్యులుకల ఒక కమిటీ విచారించాలని కెనడా ప్రతిపాదించిన తీర్మానం అంగీకరించబడింది. దీనిపై రష్యన్ విదేశాంగ మంత్రి వైషిన్‌స్కీ మాట్లాడుతూ ఎఛిసన్ ఇదివరలో చెప్పిన మాటలను జ్ఞప్తికి తెస్తూ ఆమాటలను పాటించాలన్నాడు నలభైయేడున్నర కోట్ల ప్రజలను పరిపాలిస్తున్న ప్రభుత్వానికి తావివ్వనంతవరకూ ఐక్యరాజ్యసమితి ప్రపంచరాజ్యాలకు ప్రాతినిధ్యం వహింపజాలదని బి యన్. రావుగారన్నారు కాని ఈవాదాలు అమెరికన్ ప్రతినిధి చెవుల కెక్కలేదు

తరువాత అధ్యక్షపదవికి ఎన్నిక జరిగింది పర్షియన్ ప్రతినిధి నస్రుల్లా ఇంతెజామ్‌కూ, పాకిస్తాన్ ప్రతినిధి మహమ్మద్ జఫ్రుల్లాఖాన్‌కూ మధ్య పోటీ జరిగింది అమెరికన్ దేశాలన్నీ పర్షియన్ ప్రతినిధికే ఓటుచేశాయి. మొత్తం అతనికి 32 వోట్లు లభించాయి జఫ్రుల్లాఖాన్‌కు 22 వోట్లు లభించాయి. పాకిస్తాన్ ప్రతినిధికి బ్రిటన్ ఆస్ట్రేలియాలు, అరబ్ దేశాలు ఓటువేశాయి

రెండోరోజు సమావేశం నస్రుల్లా ఇంతెజామ్ అధ్యక్షతక్రింద జరిగినప్పుడు ఉపాధ్యక్షుల ఎన్నికలు, కమిటీల అధ్యక్షుల ఎన్నికలు జరిగాయి ఈమారు అగ్రరాజ్యాల ప్రతినిధులు అయిదుగురూ కాక వెనిజూలా, ఆస్ట్రేలియా ప్రతినిధులిద్దరూ మిగతా ఇద్దరు ఉపాధ్యక్షులుగా ఎన్నికైనారు కమిటీలలో కార్యాలయ నిర్వాహక సంఘానికి భారతప్రతినిధి నవనగర్ మహారాజా అధ్యక్షుడుగా ఎన్నికైనారు.

ఆ పైన సభ్యుల ఉపన్యాసాలూ, చర్చనీయాంశాల నిర్ణయం జరిగాయి "చీనాపై అమెరికన్ దురాక్రమణ" నేరం గురించి కూడా చర్చించడానికి నిర్ణయమైంది ఇజ్రాయిల్‌పై అరబ్ దేశాల ఫిర్యాదును, దక్షిణాఫ్రికా భారతీయుల సమస్యనుకూడా చర్చించడానికి నిర్ణయించబడింది. మొత్తం 73 అంశాలను చర్చించడానికి నవంబరు 30 లోగా సర్వసభ్య సమావేశం ముగించడానికి నిశ్చయించబడింది.

## సమితి నిబంధనల సవరణ *

వీటో అధికారం అగ్రరాజ్యాల కివ్వబడినందువల్ల యుద్ధ ప్రమాదాలు సంభవిస్తే భద్రత మండలి కార్యక్రమం స్తంభించిపోగల వీలున్నది కాబట్టి సమితి నిబంధనలను సవరణ చెయ్యాలని అమెరికా నాలుగు మార్పులను సూచించింది.

1. భద్రతామండలిని అవసరానికల్లా సమావేశపరుస్తున్నట్లే 24 గంటల నోటీసులో సమితి సర్వసభ్య సమావేశం జరపాలి వీటో ప్రయోగాలవల్ల భద్రతామండలి నిర్వహించజాలక పోతున్న వ్యవహారాలను సమితి నిర్వహించాలి.

2 రెండు దేశాల మధ్య శాంతికి భంగమేర్పడే పరిస్థితిలో, అది ఏ దేశమైనాసరే అక్కడి పరిస్థితుల్ని స్వయంగా పరిశీలించి నివేదించడానికి శాంతి పరిశీలక దళాన్ని నియమించాలి అయితే ఈదళాలు ఆ దేశం ఆహ్వానంపైగాని అనుమతిపైగాని పరిశీలించవలసి ఉంటుంది

3 ప్రతి ప్రభుత్వం తన సైనికదళాల్లో ఒక దళానికి ఐక్యరాజ్యసమితి దళమని పేరుపెట్టి సమితికి అవసరమైనప్పుడు ఉపయోగించడానికి సిద్ధంగా ఉంచాలి ఈ దళాలకు ప్రత్యేక సైనిక శిక్షణ ఇవ్వబడాలి. ఈ శిక్షణ నిచ్చే నిమిత్తం ఆయాదేశాల దళాల వ్యవహారాలు నిర్వర్తించే నిమిత్తం సమితి మిలిటరీ సలహాదారు నొకనిని నియమించాలి సమితి 43 వ నిబంధన ప్రకారం ఏర్పడవలసిన అంతర్జాతీయ శాంతి రక్షక సైన్య దళనిర్మాణం జరిగేవరకూ ఈజాతీయ దళాలే ఆ కర్తవ్యాన్ని నిర్వర్తించాలి.

4 సమితి తలపెట్టే చర్యలను ఏవిధంగా నడపాలో నిర్ణయించడాని కొక కమిటీని నియమించాలి

ఈ సూచనలద్వారా భద్రతామండలి అధికారాలలో కొన్ని ముఖ్యమైన వానిని సమితిపరం చెయ్యాలని అమెరికా యత్నం. ఐక్యరాజ్య సమితి పేరుమీద అమెరికా కొరియాలో జరుపుతున్న చర్యల మాదిరిగానే, ఇతర అవసరాలలోకూడా తమ ఆధిపత్యంకింద చర్య తీసుకోగలగాలని అమెరికా యత్నం అమెరికా సూచన లామోదించబడినట్లయితే ఐక్య రాజ్యసమితినుంచి రష్యా నిష్క్రమించ వచ్చునని అమెరికన్ విదేశాంగశాఖ సలహా మంత్రి డల్లెస్ ఊహిస్తున్నాడు అయితే ఈసూచనలకి ఆసియా దేశాలన్నీ సమ్మతించగలవో సందేహం.

[సూర్యనారాయణ]

---

రా యే లచ్చి!" అని అఱవడం ప్రారంభించాడు!

వీడి కేకలకు అదిరిపోయి, తేరుకుని, మెల్లగా వాళ్లందరూ గుడిసెలోకి జొరబడి చూసేటప్పటికి నిశ్చేష్టులయ్యారు! – "శ్రీమతిలక్ష్మీబాయి" నెత్తినముసుగుతో గుడిసె మూల కూచోని శోకాలుపెడుతోంది!.... ఆ తేమ నేలమీద – మలిన వస్త్రాల్లో – అయిదుగురు పాపలూ చచ్చి పడివున్నారు!



'అగ్నిపరీక్ష'లో నాయకురాలి భూమిక ధరించిన అంజలీదేవి.

## చిత్రసమీక్ష:

# ★ ఆధీరాత్ ★

కులదీప్ పిక్చర్సువారు తీసిన 'ఆధీరాత్' చిత్రం సెప్టెంబరు 22 వ తేదీనుండి మద్రాసు అశోక్ టాకీసులో ప్రదర్శింపబడుతున్నది. నర్గీస్, అశోక్‌కుమారులు నాయికా నాయకపాత్రలు ధరించారు.

తీయని కోర్కెలతో ఆనంద జగత్తులో జీవించే ఒక యువతిని తల్లిదండ్రులు ఇష్టంలేని పెండ్లి చేస్తారు. ఆమె భర్తపెట్టే బాధలను సహిస్తుంది. కాని అతని ప్రవర్తన ఆమె సహనాన్ని దాటిపోతుంది. ఆమె శీలం పాడయ్యే స్థితి వస్తుంది. అటువంటప్పుడు ఆమెకు మరి జీవించవలసిన అగత్యం కనిపించదు. అర్ధరాత్రివలె అంధకారమయమై పోయిందామె జీవితం. నదిలోకి దూకి ఆత్మహత్యకు ప్రయత్నిస్తుంది. కాని అర్ధరాత్రి అంటే ఒకరోజు గతించిందని, మరొక రోజు జన్మించిందని కదా అర్థం. ఆమె బ్రతుకులో కూడ మరొక శుభదినం ఉదయించింది. యువకుడు, సహృదయుడు అయిన ఒక డాక్టరు ఆమెను నదినుండి రక్షిస్తాడు. ఆమెకు నర్సువృత్తిలో ఒక క్రొత్తజీవితాన్ని రుచిచూపుతాడు. ఈలోగా ఆమె భర్త కారుప్రమాదానికి గురియై, తను భార్యను పెట్టిన హింసలన్నిటికీ పశ్చాత్తప్తుడై చనిపోతాడు. ఆమె తన వలచి వలపించుకొన్న డాక్టరును పెళ్ళిచేసుకుంటుంది.

ఈ చిత్రానికి కథ, సంభాషణలు వ్రాసింది అబ్బాస్, డైరెక్షను ఎస్. కె. ఓఝూ, సంగీతం హుసన్‌లాల్ భగత్‌రాం. నర్గీస్ నిపుణతతో తనపాత్రను నిర్వహించినది. అశోక్‌కుమార్ మామూలు చిలిపి చేష్టలు చెయ్యకుండా జీవితంలో బాధ్యత ఎరిగిన పెద్దమనిషిలా నటించాడు. పాటలు మెచ్చుకోతగినవిగా ఉన్నాయి.

# తెలుగు టైపురైటరు

(18-వ పేజీ తరువాయి)

తెలుగులో జరపవలసివుంటే వ్రాతపని లాభంలేదు. టైపురైటరు వుండవలసిందే.

ఈనాడు హిందీ, ఉరుదూ, మరాటీ, బెంగాలీ, గురుముఖి, తమిళభాషలలో యథేచ్ఛగా టైపురైటర్లు వాడబడుతున్నవి. ఇందులో దాదాపు అన్నిభాషలల్లో లైనోటైపులుకూడా యేర్పడి పనిచేస్తున్నవి. దినమణి లైనోటైపుపై అచ్చవుతున్నదని తెలిసికోవడం అవసరం.

ఇపుడు మైసూరుప్రభుత్వం కన్నడభాషకు టైపురైటరు కీబోర్డు బోధను యేర్పరచగలందులకొరకు కమిటీని వేసింది. 11 జిల్లాలు 2కోట్ల జనాభా తెలుగువారు కలిగిన మద్రాసు ప్రభుత్వమున్నూ, 8 జిల్లాలు ఒకకోటి తెలుగువారు కలిగిన హైదరాబాదు ప్రభుత్వమున్నూ ఈ విషయంలో శ్రద్ధవహించాలి.

ఇంతవరకు పరిశోధనలు చేసిన ఆంధ్రాభిమానులంతా ఒకరొకరుగా యోచనచేయడం కాకుండా, అంతా కలసి కూడబలుకుకుని అందరి అనుభవాలను క్రోడీకరించుకొని అందరి కష్టాలను నివారించుకొని అందరు కలిసి ఒక సులువైన, చౌకగా లభించగల కీబోర్డును ఏర్పరచాలి. ఇందుకు భాషాభిమానులు, పండితులు, టైపుసంస్థలవారు, ప్రెస్‌వర్కర్సు, ముద్రణాలయాధికారులు, భాషాతత్వశాస్త్రజ్ఞులు, అక్షరశాస్త్రప్రవీణులు, పత్రికా సంపాదకులు, టైపురైటరు కంపెనీల ఇంజనీర్లు అందరు కలిసి ఒక సమష్టి సమావేశం జరిపి ఆంధ్రభాషాభివృద్ధికి ఒక టైపుమిషనున్నూ, లైనోటైపును సాధించాలి. అంతవరకు ఆంధ్రభాషకు మోక్షం లేదు. అది ప్రజాభాషగా, రాజకీయభాషగా, నిత్యవ్యవహారభాషగా ఈ ఆధునిక కాలంలో రాణించజాలదు.

# తంతివార్త

([illegible]-వ పేజీ తరువాయి)

మనుషు లున్నట్టే లేదే? చిమ్నీ గొట్టాలనించి పొగ రావడంలేదు. కాలిబాటలన్నీ మంచుతో కప్పబడి ఉన్నాయి. ఎక్కడచూసినా నిశ్శబ్దమే - చలికాలంలో గడ్డకట్టుకు పోయిన నీటి ఎరువుల లాగా. అక్కడున్న ప్రాణులల్లా ఏవంటే, నిలకడ లేకుండా చెట్లమీద ఇటూ అటూ పరిగెత్తుతున్న సీతాకోకచిలుకలు.

"ఇదేనా ఆ వోటు- నీకు బాగా తెలుసా?" కొద్దిగా వణుకుతున్న కంఠంతో అడిగింది వాళ్లమ్మ.

"ఇదేనమ్మా! ఆ కనబడుతున్న మూడిళ్లే. మూడో భూగర్భ పరిశోధనజట్టు అని అక్కడ చెక్కమీద రాసివుంది చూడండి బహుశా మీకు కావలసింది నాలుగోజట్టు కాంపేమో- అది అటుపక్క నూటపాతిక మైళ్ల దూరంలో ఉంది"

"అబ్బే! అది కాదు" అంది వాళ్ళమ్మ ఆ బోర్డు జాగ్రత్తగా చదివింది "ఇదే మనకి కావలసింది అయితే ఇళ్ళన్నీ తాళా లేసున్నాయ్ మెట్లమీద మంచు పేరుకు పోయింది మనుషులంతా ఎక్కడికెళ్ళారో?"

"మన మేం చెప్పగలం? కిందటి వారం ఆహారపదార్థా లేవో తీసుకొచ్చా యిక్కడికి, పిండి, బంగాళాదుంపలు, ఉల్లిగడ్డలు. అప్పుడంతా ఇక్కడే ఉన్నారు. వాళ్ళల్లోకల్లా పెద్ద ఆయనా, కాపలామనిషి కాక- ఎనిమిదిమందున్నారు. తోడేళ్లు మింగెయ్య లేదు కదా! కావలా అతనొక్క డున్నాడో చూసివస్తా-మీరిక్కడే ఉండండి" అన్నాడు బండివాడు వెళ్లబోతూ.

గొంతెత్తోలుకోటు తీసి అవతల పారేసి, మంచులో కాళ్లీడ్చుకుంటూ ఆదగ్గర్లో ఉన్న గుడిసెవేపు నడిచాడు. కొద్దిసేపట్లోనే తిరిగొచ్చేశాడు. "ఇల్లంతా ఖాళీగా ఉంది. నీళ్లకాగు ఇంకా వెచ్చగానేఉంది. అతనిక్కడెక్కడో చుట్టుపక్కలే ఉండుంటాడు - దేన్నో వేటాడ్డాని కెళ్ళుంటాడు. రాత్రిలోగా వచ్చేస్తాడు. అత న్నడిగితే అన్నీ తెలుస్తాయి"

"అతను చెప్పే దేముంది? వాళ్లు కొన్ని రోజులక్రిందటె ఎక్కడికో వెళ్లి పోయారని తెలుస్తూనే వుంది" అంది వాళ్లమ్మ గట్టిగా.

"ఏమో? అత నేం చెప్తాడో! అయితే ఏదో చెప్తాడు తప్పకుండా- కాపలావాడు కాబట్టి" అని జవాబిచ్చాడు బండివాడు

ఎంతో కష్టంమీద బండి ముందు కెళ్లింది. అక్కడనుంచి ఒక బాట అడివిలోకి దారితీస్తోంది.

తడికలు కట్టున్న వసారాలో కెళ్లారు. అక్కడ చీపుర్లు, కట్టెలు, గొడ్డళ్లు, గోడ కొక్కానికి తగిలించి ఉన్న ఎలుగుబంటి చర్మమూ ఉన్నాయి

గుడిసెలోపల వెచ్చగా ఉంది. గుడ్డాలసంగతి చూడటానికి బండివాడు బయటికెళ్లాడు. వాళ్ళమ్మ భయపడుతున్న కొడుకు లిద్దర్నీ దగ్గరికి లాక్కుని, కోట్లువిప్పుతోంది మాట్లాడకుండా. తీరా ఇంత దూరమూ వస్తే, నాన్న ఎక్కడికో వెళ్ళిపోయినారా?

(ఇంకావుంది)

# తమిళ లిపికి సరికొత్త లైనోటైప్

(19-వ పేజీ తరువాయి)

తయారుచేశారు. ఈ యంత్రం అనతికాలంలో మద్రాసు చేరుతున్నది. త్వరలోనే మద్రాసులో ఈ యంత్రంమీద పనిచెయ్యటం ప్రారంభించుతారు. దీనివల్ల ఇంగ్లీషు పత్రికలతోపాటు తమిళ దినపత్రికలు కూడా ప్రజలకు వార్తలను అందించగలుగుతాయి. "దేశభాషాలిపులు కొన్ని అందచందాలను పెంపొందించుకున్నాయి; ఏ లిపి సంస్కరణలు జరిగినా ఈ సౌందర్యాన్ని నశించిపోకుండా జాగ్రత్తతీసుకోవాలి" అన్నారు బ్రౌన్.

"భాషకూ లిపికీ వున్న భేదాను మనం గమనించాలి. భాష వాచ్యంగా ధ్వనిమీద ఆధారపడివుంది. లిపి సంజ్ఞలమీద ఆధారపడివుంది. ఏ భాషనైనా ఏ లిపిలోనైనా వ్రాయవచ్చు. భరతనాట్యంలోని ముద్రలూ హస్తాలూ ఎలా ఆయా భావాలు వెల్లడించటానికి సంజ్ఞలో, అలాగే లిపిలో వ్రాసే ప్రతి అక్షరమూ ఆయా ప్రత్యేక ధ్వనులను నిరూపించటానికి అలాటి సంజ్ఞలు.

"దేశానికంతకూ ఒకే లిపి వుంటే బాగుంటుందనే ఉద్దేశంతో కొంతమంది భారతీయ మిత్రులు రోమన్‌లిపిని సేకరించితే బాగుంటుందని సూచించుతున్నారు. అలా చేస్తే బాగానే వుంటుంది ఉన్నపళంగా, టైప్, లైనోటైప్ సౌకర్యాలన్నీ కలుగుతవి; పైపెచ్చు, మాతృభాషా లిపినే కాకుండా తక్కిన దేశీయ లిపుల నన్నిటినీ నేర్చుకోవలసిన బాధ తీరుతుంది.

"అంతర్జాతీయంగా కూడా ఇది యెంతో ముందడుగు వేయట మౌతుంది. అంతర్జాతీయంగా మనమంతా ఎన్నో విధాల సన్నిహితులం కావలసివుంది. ప్రపంచంలో పలుప్రాంతాలవారూ పరస్పరం అవగతం చేసుకోవటానికి సావకాశం ఇచ్చేదేన్నయినా నేను ఆమోదించుతాను" అన్నారు బ్రౌన్.

---

"అరె! ఎక్కేషాపూ, దిగేషాపూ వెదకి తిరిగాను కాని కావలసింది దొరికితేనా!"

"అవునెల్లా దొరుకుతుందీ! నీకావలసింది అరువఇయ్యే!"

---

# ప్రజాస్వామ్యం నూరుపాళ్లు

(14-వ పేజీ తరువాయి)

"ఏమిటా గుప్తగారిలో వున్న విశేషం?" అన్నది ఓ గొంతు.

"ఏమిటి ఆయనలో లేని విశేషం?" ఎదురడిగింది మరో గొంతు.

"వట్టి కళాహీనుడు!"

"కావచ్చు; కాని కళాభిమాని"

"అవును. బ్లాక్ మార్కెటు కళాభిమాని"

"బ్లాకు చెయ్యనివా డెవడంట!"

"బ్లాకుమార్కెటును జాతీయం చేయడానికి పూనుకున్నందుకు మేం తీవ్రంగా నిరసిస్తున్నాం."

"చేస్తుంటే తప్పులేదుగాని అంటే వచ్చిందీ!"

"ఎవరూ చేయడంలేదు; ఒక్క గుప్తగారు తప్ప"

"అందుకే గుప్తగారిపేరు ప్రతిపాదించబడింది." అంది మూడో గొంతు.

గడచిన సమావేశంలోని సంఘర్షణకూ, దీనికీ సామ్యం లేకపోవచ్చు; కాని స్వభావం మాత్రం ఒకటే. అందరికన్న మొదలు ఈ సంఘర్షణమూలంగా గుప్తగారికి గుబులు పట్టుకుంది. తనపై జరుగుతున్న ఈ చర్చ తన మంచికి కాకపోగా, తనపట్ల ప్రమాదకారణంగా పరిణమించే సూచన కనిపించింది...సభామధ్యంనుంచి లేచి, గబగబా వేదిక దగ్గరకు చేరుకుని "నాకొద్దు బాబో, ఈ అధ్యక్షపదవి" అంటూ చేతులు జోడించాడు.

సమావేశంలో పెద్దమనిషికి ఎటూ పాలుపోలేదు. "మరెవరిపేరైనా సూచించండి" అని అనడంతప్ప మరేమీ చేయలేకపోయాడు ఈ తడవ ఆ పెద్దమనిషి పేరే సూచించబడింది. ఇక వ్యతిరేకత వుండబోదని ప్రతిపాదకుని విశ్వాసం.

"కళింగరావు ఈ పదవికి పనికిరాడు"

"కళింగరావుగారు సంగీతవిద్వాంసులు. వారే ఈ పదవికి సమర్థులు"

"విద్వాంసులు కావచ్చు; కాని సంగీతానికి చింతకాయలు రాలవ్" అన్నది గుప్తగారి గొంతు

"కళింగరావు కరణం!.. కరణపు పురుగు కళారాధకమండలి గద్దె ఎక్కడానికి వీల్లేదు." మద్దతిచ్చింది రంగయ్యగొంతు.

కళింగరావు లేచి, నాకు "ఈపదవి ఇష్టంలేదం"టూ సమావేశాన్ని తిరిగి వాయిదా వేశాడు.

* * *

మళ్లీ నెల తిరువాత అదే టౌన్ హాలులో సమావేశమయ్యాం. ఈ తడవ ఆ పెద్దమనిషి పేర్లు సూచించమని ఎవ్వరినీ అడగలేదు. రెండేవిషయాలు చెప్పాడు. ప్రతికున్న సభ్యుడెవ్వడూ అధ్యక్షుడు గావడానికి మన మెవ్వరమూ అంగీకరించం మనకు ఇక రెండే మార్గాలున్నయ్.. ఒకటి; మన మండలిని రద్దు చేసుకోవడం. రెండవది; కనీసం మన సంస్థనైనా దక్కించుకోవాలనుకుంటే నూతనాధ్యక్షునిఎన్నిక కార్యక్రమం మాని, కీర్తిశేషులైన అధ్యక్షులవారినే మనం అధ్యక్షునిగా భావించుకుంటూ పనిచేయాలి.

"ఆయన లేడుగదా!" అడిగింది ఓగొంతు.

"ఆయన బొమ్మే చాలు, ఈ విపరీత విపత్కర పరిస్థితులమధ్య మన సంస్థను సజీవంగా ఉంచడానికి" అన్నాడు కళింగరావు.

అందరూ చప్పట్లు కొట్టారు. మౌనం అంగీకారంగా తీసుకోబడింది.

* * *

కళింగరావు సమావేశంనుండి బయటకు రాగానే, పత్రికలవాళ్ళు చుట్టు ముట్టారు.

"ఏమైంది ఎన్నికల గొడవ?"

"అంతా చల్లారిపోయింది."

"అంటే?"

"ఎన్నికలే మానుకున్నాం!"

"మరి?.."

"కీర్తిశేషులైన మా పాత అధ్యక్షులే మాకు శాశ్వతాధ్యక్షులు"

"అలా జరిగిందేం?."

"మంచిదేగా!. ప్రజాస్వామ్యానికి నూటికి నూరుపాళ్ళ విజయం!"

---

# భాషల పుట్టుపూర్వోత్తరాలు

(28-వ పేజీ తరువాయి)

ప్రజాస్వామ్యకళలో కూడా ప్రవేశించాయి.

వెనకటిరోజుల్లో గ్రంథపరిశీలన విజ్ఞానాభివృద్ధికోసం. నేడు పుస్తకాలు చదవడం- నూటికి తొంభైవుంది విషయంలో కాలక్షేపంకోసం. రెండువందల ఏళ్ళక్రితం ఆంగ్లరచయిత "చదవడమనేది ఖూసావ్యాపకంగా ప్రజలు పరిగణిస్తున్నారు" అన్నాడు. ఆ మాటలు ఈనాటికూడా అక్షరాలా నిజం

సాహిత్యం ప్రజాస్వామ్యకళగా మారగానే, పద్యరచనకి ప్రోత్సాహం తగ్గి, వచనానికి ప్రచారం పెరిగింది. కళాకారుడు. ప్రజాభిరుచినిబట్టి వచనాన్నే ఆశ్రయించవలసవచ్చింది. కవిత్వం రసజ్ఞుల కళ' అయింది.

వచనంలో కాలక్షేపానికి చదువుకునే పుస్తకాలు తయారయాయి. "నిత్యజీవితంలో తీరని కలలు పుస్తకాల్లో చదివి ఆనందపడతాడు పాఠకుడు" అంటారు కొందరు. ఈ అభిప్రాయంలో కొంత నిజం లేకపోలేదు. చదవడమనేది కూడా- కాఫీ, సిగరెట్లూ, సినిమా ఎలాగో-అలాటిదే ఒక అలవాటు. మెదడుకి పని చెప్పే అలవాటు కనక, 'ఇది దురలవాటు కాదు' అని మనం అంగీకరించాలి. 'తినగ తినగ వేము తియ్యనౌను' అన్నట్టు చదవగా చదవగా విజ్ఞానవంతుడు కావచ్చు.

విజ్ఞానాన్ని యివ్వవలసిన గ్రంథం కాలక్షేపాన్నిచ్చేదిగా తయారుకావడం వల్ల, అది విలువలోనూ అంతస్తులోనూ దిగిపోయింది. దేశానికయితే ఎల్లలున్నాయిగాని సాహిత్యాని కవి లేవు. సాహిత్యం యావత్ప్రపంచానికీ చెందుతుంది. దానికున్నదల్లా భాషానియమాలు.

సౌందర్యాన్వేషణలోనే సాహిత్యం వెలువడింది; వెలువడుతుంది. సౌందర్యం సర్వమానవకోటీ చెయిజాచి పొందగలిగే ధనం. కడివెడునీళ్లు తెచ్చుకుంటే చెరువు యింకిపోతుందా? అంత సౌందర్యం వుంది ఈ భూమండలంమీద. ఈ సౌందర్యానుభవానికి అర్హత కలిగించేదే సాహిత్యోపాసన. రసజ్ఞత మన హృదయంలో ఉండాలి; మన జ్ఞానేంద్రియజ్ఞానం పెరగాలి. ధనాపేక్ష కాక దయారసం మన జీవితాలని సరిదిద్దాలి. ఆనాడు లలితకళలలోని ఆనందం మనకి అనుభవమౌతుంది.

(అయిపోయింది)

(ఆలిండియారేడియో సౌజన్యంతో)

---

**శ్రీ ఎన్. ఆర్. చందూర్**

# యోగీశ్వరుడు
# కరుణానిధి

(29-వ పేజీ తరువాయి)

బృందమునకు లేకపోయింది. మా యింటి కళే తరిగిపోయినట్టయింది.

శ్రీశాస్త్రిగారు అప్పుడప్పుడు చెప్పే ఉపన్యాసాలలో ప్రతివాక్యం ప్రతి అక్షరం శ్రద్ధగా వింటుండేవాడిని ఆయన మాటలు వింటున్న వారందరిలోను ఆనందం తాండవించేది తమ యోగం రోగనివారణకు మాత్రమే కాక, బ్రతికి వుండగానే బ్రహ్మసాక్షాత్కారం, బ్రహ్మత్వం పొందడానికేనని, బ్రహ్మసాక్షాత్కారమంటే, మరణించినతర్వాత ఎక్కడో పైన పొందడం కాదనీ శ్రీ శాస్త్రిగారనేవారు. శ్రీ సి. వి. వెంకోసామిరావుగారు అనే యోగివర్యులు కుంభకోణములో అవతరించి 1910లో ఈశ్వరసహిత తారక రాజయోగాన్ని ప్రారంభించినారని, అప్పటి నుంచి వారు 150 మంది శిష్యులను ఈ యోగంలో చేర్పించినారని, 1916 లో తాము శాస్త్రిలు గారు కుంభకోణంలో వారివద్ద ఉపదేశం, సాధన పొందినట్టు శ్రీశాస్త్రిగారు అంటుండేవారు వారి సంస్కృతి సాహిత్యశిల్పకళా పరిజ్ఞానములే యీ యోగసాధన మెయిన్ లయిన్ ? నా భావన అని చెప్పేవారు శ్రీ ప్రభాకరశాస్త్రిగారు యీయోగములో చాలా వుత్తీర్ణులయి వారిలో అనేక యోగశక్తులు సంక్రమించి వారు పరోపకారార్థమిదం, శరీరం అనుకొని బాధపడితుల బాధలను పోగొట్టేవారు. ఏ వైద్యానికీ లొంగని జబ్బులను యోగశక్తితో లొంగదీసేవారు క్షయ, ఉబ్బసం, నరాలజబ్బులున్నగు భయంకరవ్యాధులు, చివరిరోజులలో కుష్ఠరోగంకూడా నయం చేసేవారు

నేను ఒకప్పుడు తిరుపతి. శ్రీగా వారు ఇంటి ముంగిట ఇద్దరు కుష్ఠరోగులను కూర్చోబెట్టి 'ట్రీట్' చేస్తున్నారు. వారికి ఎంతో నయమయినట్టు కూడా విన్నాను వారు ఈవిధంగా ఇద్దరు కుష్ఠురోగులను బాగుచేసినతర్వాత, గాంధీజీ కుష్ఠురోగులను అంటువ్యాధులుగా పరిగణించరాదని, వారిని సహపంక్తిని కూర్చోపెట్టుకోవచ్చునని ప్రసంగించడం విని శ్రీశాస్త్రిగారు అమందానందం పొందారు. శ్రీకృష్ణుని కుమారుడైన సాంబుడు సూర్యారాధనచేసి, కుష్ఠురోగాన్ని పోగొట్టుకున్నట్టు పురాణగాథ కలదు ఆ ప్రభాకర భగవానుడే మానవరూపమున ప్రభాకర శాస్త్రిగా అవతరించినట్లు తోచేది. ఆయనను చూస్తే, ఏ మహావీరాచార్యుడో, గౌతమబుద్ధుడో, ఏసుక్రీస్తో అనిపించేది వారు ప్రార్థనలో కూర్చున్నప్పుడు పరికించి చూస్తే గౌతమబుద్ధుడు స్మరణకువచ్చేవాడు. బుద్ధుని విగ్రహాలు చూస్తే శాస్త్రిగారి సౌమ్యమూర్తి పోలికయున్నట్టు తోచేది ఆయన ఈ అవతారం ఆ అవతారం అననేల! చాల మొండిగావున్న వ్యాధిని వారి దివ్యహస్తాలతో తాకినంతనే నగ్గుకునేది ఆవిధంగా ఏసుక్రీస్తుకూడా ఎందరికో జీవప్రదానం చేసేవాడట

శ్రీ శాస్త్రిగారికి మహావీరాచార్యుడు, బుద్ధుడు, క్రీస్తు, గాంధీజీ అంటే ఎంతో ప్రేమాభిమానములు వారు గాంధీజీ స్వాతంత్ర్యోద్యమంలో పొలిటికల్ గా పాల్గొనకపోయినా సత్యాన్వేషణలో, అహింసా విధానంలో ఆయన గాంధీజీ అనుయాయి గాంధీగారిని గురించి ఎవరేమన్నా చాలా బాధపడేవారు, ఐదారుమాసాల క్రితం గాంధిరామాయణం, ప్రజ్ఞాప్రాభాకరం అనే రెండు పుస్తకములు వ్రాయాలనిసంకల్పించినారు మన దురదృష్టవశాత్తూ ఆ రెండు పుస్తకాలు పూర్తికాకనే వారు అసువులు బాసినారు. పూర్తిచేసివుంటే శిష్యమాత్ర బృందానికి ఎంతో విజ్ఞానకరంగా వుండేది. ఆ అదృష్టం దక్కలేదు

శ్రీ శాస్త్రిగారి దృష్టిలో అంతా సమానమే చిన్న, పెద్ద, బీద, శ్రీమంతుడు, అనేభేదంలేదు "విద్యావినయ సంపన్నే బ్రాహ్మణే, గవిహస్తిని శునిచైవ, శ్వపాకేచ, పండితాః సమదర్శినః" అన్న మాట వారికే తగును వారిసమాన భావాన్ని గురించి శ్రీ విస్సా అప్పారావుగారు ఎన్నో ఉదంతాలు చెప్పేవారు

గాంధీజీ హరిజనోద్ధరణ వారికి చాలా ప్రీతి 10 ఏండ్లక్రింది సంగతి శ్రీశాస్త్రిగారి తమ్ములు శ్రీ శంకరశాస్త్రిగారి పెద్దకుమార్తె పెండ్లినాటి ముచ్చట ఆ వివాహం శ్రీ ముక్త్యాల రాజాగారి యాజమాన్యాన అతివైభవంగా జరిగింది ఆయూరిలో అష్టాదివర్ణాలవారున్నా ఒక పంక్తిని భోజనాలు చేస్తున్నారు శ్రీశాస్త్రిగారు దగ్గరవుండి జరిపిస్తున్నారు. ఒకరోజు ఒకహరిజనస్త్రీ ఉదయం తొమ్మిదిగంటలకు పెండ్లిపందిరి ముంగిట పడివుంది. ఆమె చేతులు కాళ్ళు కొంకర్లుపోయాయి స్పృహతప్పింది. శ్రీ శాస్త్రిగారు వెంటనే వచ్చి ఆమె కాళ్లు, చేతులను తమ దివ్యహస్తాలతో స్పృశించగా మూడు నాలుగు నిమిషాలలో ఆమె కండ్లు తెరిచింది. శ్రీ శాస్త్రిగారు సంగతేమని విచారించగా, 'బాబూ నాలుగైదు రోజులు గానాకూ, నాబిడ్డలకు, నా భర్తకూ అన్నంలేదు వచ్చి నాభర్త, బిడ్డల అవస్థ చూడలేక యిక్కడికి వచ్చినాను ఇంతలో నాకు తెలివితప్పి పడిపోయినాను' అని ఆమెఅన్నది. శ్రీశాస్త్రిగారు వెంటనే కొంచెం మజ్జిగ తెప్పించి మొదట త్రాగించారు తర్వాత పెండ్లి పిండివంటలతో భోజనం పెట్టించారు. ఆమె దానికి మొదట అంగీకరించలేదు. తన పిల్లలకు, మగనికిముందు అన్నం పెట్టాలన్నది. శ్రీ శాస్త్రిగారు ఆమె మాటలకు ఒప్పుకొని వారినికూడా పిలిపించి భోజనం పెట్టించారు. అంత దయామయులు శాస్త్రిగారు. వారిని పొగడడానికి ఈనోరు చాలదు.

మృత్యువిజయం కోసం పోరాడుతున్న శ్రీ శాస్త్రిగారిని మృత్యువు పొంచి వెన్నాడుతూవున్నట్టుంది. వారు తిరుపతి మ్యూజియంకోసం బెజవాడకు వెళ్ళి అష్టకష్టాలు పడవలసివచ్చింది కృష్ణా జిల్లా, గుంటూరు జిల్లాలలో పర్యటన చేశారు. వానలో తడిశారు. భోజన సదుపాయాలు వేళకు కుదరలేదు. కృష్ణాజిల్లా గెద్దనపూడి నుండి తిరుపతి చేరేసరికి 104 డిగ్రీల జ్వరంవచ్చింది వారి అసిస్టెంటు శ్రీ బాలకృష్ణమూర్తిగారి సహాయంతో ఇంటికి చేరుకున్నారు రెండు రోజులకల్లా ఇంకా ఆరోగ్యం చేకూరకనే డ్యూటీలో చేరారు

డాక్టర్ బాలసుందరరావుగారు, విస్సా అప్పారావుగారు తిరుపతి వచ్చినారు. డాక్టరుగారు శాస్త్రిగారిని పరీక్షించారు ప్రమాదమేమీ లేదని అన్నారు. కాని మరికొన్ని రోజులకే ముప్పుతప్పలేదు వారిఅంత్యదర్శన భాగ్యం నాకు కలిగింది ఇక వారి భౌతిక దేహం కనిపించక పోయినా, వారి భావాలు, వారిఅంతరాత్మ సర్వత్రవ్యాప్తంగా, అంతరంగంగా మన హృదయాలలో వ్యాపించి సర్వకాల సర్వావస్థలయందూ, రక్షించుచుండునని భావించినాను శ్రీశాస్త్రిగారు తిరుపతిలో శ్రీ వెంకటేశ్వరుని కప్రక్క, తామొకప్రక్కగా భక్తజనులకోరికలు తీర్చి, వారి కష్టాలు బాపేవారు.

వారు భౌతికం తాత్కాలికంగా విడిచినా, మానవసంరక్షణార్థం శీఘ్రంగామరల భూలోకంలో అవతరిస్తారని నావిశ్వాసం.

★

# అమలాపుర ప్రాంతాల్లో అతివృష్టి

★



అమలాపురంలో రొమ్ముబంటినీట మునిగిపోయిన లేబరు పాఠశాల



ఏలూరుతాలూకాలో తమ్మిలేరు గండ్లుపడి
పోణంగి గ్రామపు భూములను
ముంచివేసింది









అమలాపురానికి వెళ్లేదారిలో కౌశిక
వంతెనవద్ద పడిన గండ్లు



Regd. No. M. 4479

ఉత్తమ శైవమత గ్రంథము

# పండితారాధ్యచరిత్ర

పాల్కురికి సోమనాథుడు రచించిన ఉత్తమ ద్విపద కావ్యము. డా. చిలుకూరి నారాయణరావు గారిచే పరిష్కరింపబడినది. పీఠిక, [illegible], [illegible], [illegible], పద్యాదులను అయిదు ప్రకరణములను ఇందే [illegible] గలవు. ఇంత విపులముగ ఈ గ్రంథము నిదివరకెవ్వరును ప్రచురించ [illegible] [illegible] అమూల్యములు [illegible].

వెల రు 5-0-0 లు.

ప్యాకింగు పోస్టేజి రు. 1—4—0.

ఆంధ్ర గ్రంథమాల,

పోస్టుబాక్సు 212, మదరాసు 1.

Edited, Printed & Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, 7, Thambu Chetty St., Madras.